

# కాళిదాసనాటకము

ఇది

బళ్ళారిలో వకీలుగానుంచిన

కీ. శే. బ్రహ్మశ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారిచే

నాలుగంకముల నాటకముగ నాంధ్రభాషను నతివిచిత్రముగా

రచియింపఁబడినది.

కె. శత్రుఘ్న రావుచే

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు.

బళ్ళారి.

ఆంధ్రముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1925.



వెల రు. 1—8—0

# పీ ఠి క.

ఈ నాటకములోని యితివృత్తమంతయు నా స్వంతముగాదు. బ్రహ్మశ్రీ చిలకపాటి వెంకట రామానుజాచార్యులవారు కాళిదాసనాటకమనియు భోజనాటకమనియు వినోద కథాకల్పవల్లియనియు వ్రాసియుంచిరి. పూర్వకవుల శ్లోకపద్యము లనేకము లెత్తి కాళిదాసకృతములని వారు వ్రాసినారు. అందులోని గొన్ని పూర్వ కవికృత చమత్కార శ్లోకములు నే గ్రహించితిని. మిగిలినవానిని గాలవిళంబ భీతిచే వదలితిని. మైసూరు రాజ్యములోఁ బండితులగు బ్రహ్మశ్రీ వేంకటాచార్యుల వారు కర్నాటక భాషలో భోజప్రబంధమని యొకనాటకము వ్రాసినారు. అది ప్రదర్శనీయముగ నున్నదికాని కొన్ని యసందర్భాంశములున్నవి. అవి పండితవరులకు రుచింపవని తోఁచును. ఈ నా నాటకములోను, నసందర్భాంశము లనేకములుండును. కశ్యపునకు మదాలసయను నప్సరసయందుఁ బుట్టినవాఁడు కాళిదాసని నే నింతకుమున్న వినియుండలేదు. బ్రహ్మశ్రీ సారపరాజు లక్ష్మీ[illegible]తముగారు, తమ కాళిదాసనాటకములో, నీ గాథను సూచించినారు. ఆగాథ నేనును గ్రహించితిని. ఈ నాటక మక్షరాస్యులాడినఁ జక్కఁగనుండును. కానిచో హాస్యాస్పదమగును. పండితవరులకు నా నమస్కృతులు. అర్థాస్వాదన మొనరింపక శబ్దమూల్యవిచారకులగు పెద్దలకును నా వందనములు. పండితశిరోమణియై వాక్పతియను బిరుదునంది సారస్వతప్రపంచంబునమిక్కిలి ప్రసిద్ధిఁగాంచిన ముంజమహీపాలుఁడు భోజునిఁజంపఁ బ్రయత్నించెననుట విశ్వాసార్హముకాదు. ఈ నాటకములోఁ బూర్వకవుల సంస్కృత శ్లోకములు విశేషముగ నుండు కారణంబునఁ దెనుఁగుపద్యములు గొన్నిమాత్రము రచించితిని. సమస్యాపూర్ణములకు వ్రాయఁబడినపద్యములు కేవలచాటువులయి యాంధ్రప్రపంచమునం దెల్లెడ వ్యాపించినవి. కొన్నిపద్యములు వదలఁదగినవిగనున్నవి. ఈ నాటక సంవిధానమంతయును కేవల కల్పనాకథగఁ బారంపరిగ వచ్చినదిగాని యథార్థస్థితిగ నుండునని తలఁచుట సమార్గము లేదు. భవభూతి,దండి, బిల్హణాదికవులు కాళిదాసుని సమకాలికులుగారు. భోజరాజుకాలముననుండిన కాళిదాసభినవ కాళిదాసగునుగాని యాదికాళిదాసుగాదు. ఆది కాళిదాసు శాకుంతలాది నాటకములు రచించిన ప్రసిద్ధవరకవి. ఆది శంకరులు భర్తృహరి మొదలగు మహానుభావుల సమకాలికుఁడు. క్రీస్తుశకమునకు నాఱుశతా

బ్దములకు మున్నున్నవాఁడు. విక్రమార్క భోజుల కాలమునందున్న వారభినవ కాళిదాసులను బిరుదములందినవారు. ఈ యభినవదాసులలో నెవరో యొకరు, మేఘసందేశ కుమార సంభవాది కావ్యములు రచించినారు. భాగవత చంపూప్రబంధమొక యభినవకాళిదాసు రచించెను. వీరికాలమెఱుంగుట కష్టముగనున్నది. ఈ యభినవ కాళిదాసబిరుదు లెవరిచేనైన నొసంగఁబడినవియో లేక యిప్పటికవులంబలె రాజశాసనభయములేమి, తమంతకుదామే స్వతంత్రించి యుంచికొనినవియో తెలియరాదు. ఇటులనే యభినవశంకరులు, కవిబ్రహ్మలు, కవితా పితామహులను బిరుదులు వాడుకలోనున్నవి. స్వతంత్రించి భూషించికొనుట యెట్టివేదుకయో! నాటకములు రచించిన కాళిదాసుని పేరు మాతృగుప్తుఁడు. ఇతఁడుజ్జయిని నేలుచు శాక్యులను నార్యావర్తమునుండి పాఱఁదోలి శాకారినృపతియని పేరంది హర్ష శకమును స్థాపించిన శ్రీహర్ష విక్రమాదిత్యుని యాస్థానకవి. క్రీస్తుశకమునకు 457 వత్సరములకు ముందున్నవాఁడు. శ్రీ హర్ష విక్రమాదిత్యునంతటి బలాఢ్యులకు విక్రమాదిత్యనామమును, గాళిదాసునంతటి విద్యాధికులకుఁ గాళిదాసనామమును లభించుటచే నిజమగు వారిజీవితకాలములు సనాతనమునుండి యధునాతనమునకు నీడ్వఁబడినవి.

సుజన విధేయుఁడు

కోలాచలం శ్రీనివాసరావు

బళ్లారి

**14-8-1916**

## పురుషపాత్రలు

| | |
|---|---|
| సూత్రధారుడు | పెద్దభోజుడు |
| బ్రహ్మ | కంఠీరవుడు |
| దుర్వాసుడు | భటుడు |
| విశ్వామిత్రుడు | కరాళుడు |
| భరతముని | బుద్ధిసాగరుడు |
| కండు | సేనానాయకుడు |
| విభాండక | గౌతముడు |
| మాండకర్ణి | విక్రమరాజు |
| [illegible] పాల | అంగ-వంగ - కళింగ కాశ్మీర రాజకుమారులు |
| ఇంద్రుడు | |
| ముంజరాజు | మంత్రి |
| కృష్ణశాస్త్రి | డంబరవాడు |
| బ్రహ్మశాస్త్రి | దర్పసారుడు |
| దుర్బుద్ధి | బ్రహ్మరాక్షసుడు |
| దుశ్శాసనుడు | భవభూతి |
| దుర్ముఖుడు | దండి |
| వీరయోగి | భాణ |
| చిన్నభోజుడు | కల్హణ |

| | |
|---|---|
| మల్లన | బ్రహ్మావధాని |
| కుటుంబకవులు | శంకరకవి |
| కుంభకారుడు | నర్తకులిద్దఱు |
| కుబేరుడు | కుంటి, ఏకాక్షి, అంగహీనుడు. |
| నిర్భాగ్యశాస్త్రి | జూదరులు |
| సుబ్బావధాని | |

స్త్రీపాత్రములు

| | |
|---|---|
| నటి | మదనసేన |
| సరస్వతి | సీమంతిని |
| సావిత్రి | సఖి |
| పుంజికస్థల | కాంచనమాల |
| గుణమాలి | వేశ్యలు |

నటి:—అటులైనఁ గర్తవ్యాంశంబిపుడెద్ది.

సూత్ర:— నాతీ! అనూచానాచారక్రమ మనుసరించి ఋతువర్ణనము సలుపుట?

నటి:—నాథా! యేఋతువునుగురించి వర్ణింతును?

సూత్ర:— అంగనల శృంగారాభిరచనలకు దోహదప్రాయమైయుండు వసంతర్తువర్ణనము సమంజసము గదా?

నటి:— అటులైన గీతాముఖంబున దానిని వర్ణింతును వినుము.

సీ. కుసుమరసంబును గుత్తింభరులఁ భంగి
గ్రోలుచు నలియుభృంగాళి యెచట
విరితావులను జేరి పరిమళంబు, నలంది
కొమ్మల విహరించు కుజము లెందు
వాగ్వైభవంబును వాసిగాఁగని, గాన
ములు సేయుచుండు కోయిలలగుంపు
మధుకరా వళిఁగూడి మధుసఖునిఁ జేరి
మాధవుఁడు ద్యుత్తిమ హిని సేలు

గీ. పంకజాతా ననలమోము పొంకములను
బోలెజలములు విమలమై పొలుపుఁగాంచి
మరుసిధర్మాతి మహిమను మధురమగుచు
సంతసముఁ గూర్చుమదికి వాసంతఋతువు.

సూత్ర:— నాతీ! నీవర్ణనము రసిక జనాహ్లాదంబుఁగనున్నది.

నటి:—నాథా! ఈ వసంతమున సూర్యుఁడేల శనైశ్చరుఁడగును?

గీ. నాథ! అదియేల దివసాధినాథుఁడిపుడు,
మందగతినందెనభమున, మందురీతి.

సూత్ర:— నాతీ! దానికిఁగారణము శృంగారవతులగు నంగనలే.

గీ. భామ! భానుండుభామల మోముపసలు,
గనఁగనెన్నుచు మాంద్యంబుఁగని యెగతిని.

నటి:—నాథా! నీవుడివిధరీతి నంగనల శృంగారములఁజూడ నపేక్షించి సూర్యుఁడు నభోమార్గంబున మెల్లఁగనడుచుచుండినచో మలయమారుతుఁడేల యిపుడు తిన్నఁగనడుచుచున్నవాఁడు?

సూత్ర:— నాతీ! దానికిని గొమ్మలేకారణము?

గీ. పుష్పవతులయి కొమ్మలుపొలుపుమీఱ
బనసుఁడజ్ఞతవారినిఁబవిలి, పిదప

స్నాతుఁడై మెల్లమెల్లన సంచరించు,
మఱలఁ దాఁకుదునను భీతి మనము చవుల.

నటి:— నాథా! మిమ్ము నెద్ది ప్రశ్నించినను సుదతులపైననే దోషమారోపించుచుందురు. మఱియొకటి మిమ్మునడిగెద దానికేమి బదులిడుదురో చూచెద.

సూత్ర:— నాతీ! అడిగెదవేమి యడుగుమా.

నటి:— నాథా! ఇక్కాలంబున మనసరసుల రసమెల్ల నింకుచుండును. కారణంబదియేమి?

సూత్ర:— తరుణీ! దానికిని స్త్రీలే కారణములు.

నటి:— నాథా! అదియెటులు?

సూత్ర:— ఎటులనా! తెలిపెద వినుము?

గీ. తాపమోప సరసులఁ దానమాడ
నిమ్ననాభులు పాలుపార నిలిచియుండ,
వారినాభులు బిగఁ ద్రావె వారి నెల్లఁ
గాననింకెను సీరెల్లఁ గాంతవినవె.

నటి:— నాథా! ఇఁక నేను మిమ్ముఁ బ్రశ్నింపను. రండు. సింధులరాజకుమారుఁడగు భోజరాజునకుఁ బట్టంబుఁ గట్టక ముంజరాజు తానే సింహాసనమధిష్ఠింప యత్నించుచున్న వాఁడఁట. అనేకులకిది యిష్టములేనిపని. ఇదియెటు పరిణమించునో కాంచెదము రమ్ము.

సూత్ర:— ఇది యనర్థమునకుఁ గారణంబగును. మనము పోవుదము రమ్ము.

(ఇది ప్రస్తావన)

(సమాప్తము.)

పూర్వరంగము

(ఇది ప్రారంభము - పిదప నాంది)

బ్రహ్మ - సరస్వతి - సావిత్రి - పుంజికస్థల - దూర్వాసుఁడు
విశ్వామిత్రుఁడు - భరతముని - కండు - విభండక
ఘాండకర్ణి - మందపాల - ఇంద్రుఁడు.

సరస్వ:— పుంజికస్థలా! భరతమహాముని శాపమునకు నీవు భీతిలవలదు. నీవు నిర్వాచరించిన నేపథ్యాభినయ వ్యతిక్రమమునకుఁ గోపగిల్లి భూతలమున వేశ్యవై పుట్టుమని శపించెను. నేఁడు నీ నాట్యనైపుణ్యముఁ జూపి వారి ప్రసాదంబాపేక్షింపుము. నీకు శాపావధి నైశ్యంబె కలిగింతురు.

క. అతిశయకోపంబూనుచు;
యతివరులు శపింతు రెంత యధికులనైనన్;
మతి శాంతిఁ జెందినంతనె,
యతివా! శాపముమరల్తు రధికప్రీతిన్.

దుర్వా:— ఏమి యేమి! ఈ భరతముని యీ సౌందర్య లావణ్యఖనికి నటన నైపుణ్యశాలినికి, పుంజికస్థలకు, శాపంబిచ్చెనా? (విశ్వామిత్రునిఁజూచి) చూచితివియా విశ్వామిత్రా! ఈ భరతుని యవివేకము! నీవయియుండినచో, మేనకాసంగమ సుఖంబెట్లిదంబని యీ మొల్ల సుగంధి పరిరంభణాది సుఖంబుల మైమఱచుచుంటివి కదా?

విశ్వా:— ఏమి. దుర్వాసా! అటుమాటలాడెదవు? ఆ మేనక రూపాతిశయంబున శతాంశమైన దీనికిఁ గలదా? అందము లేని కందళినిఁ గూడినవానికి నీకు నీ పుంజికస్థల రూపంబతిశయంబుగాఁ దోఁచా? (విభండకునిఁజూచి) ఏమి. విభండకా! ఈ విషయంబున నీ తాత్పర్యమేమి?

విభండ:— విశ్వామిత్రా! మీ యిరువురి తాత్పర్యంబున నేనేకీభవింపను. కందళి, కేవలకదళీస్తంభము, మేనకాసక, మల్లెలునది మేనక. హరిణీకేఁదులతూఁగు కరిణిగమన రమోత్తమని యనింపదు. ఆ యతిపయింతటి రూపవతికాఁజేసి నా తపంబెల్ల దూరపోని, నేనొక యరణ్యమృగంబునై దానివెన్నంటి తిరుగుచుంటినా? (కండునిఁజూచి) ఏమి కండూ! నామాట నిజము గాదా?

కండు:— విభండకా! మీ రెవరేమనుకొనిన, ననుకొనుఁడి, నాకేమిభయములేదు. ఊరుకాండజిత మోచయగు ప్రమ్లోచకు వీరెవరును సమానులు కారు. ఔనా కాదా మాండకర్ణీ?

మాండ:— ఈ విషయంబున వివాదంబేల? మీపలుకుబడికే యంతటిరూపవతులయిన, విజితకనకతనూరోచియగు ఘృతాచి నేమూలఁద్రోక్కుదురు? ఘనకచభారయగు తారను నే యంబరమున నిలుపుదురు? జనతానుతనామయగు హేమ నే యగ్నినిఁబడవైచి కాచుదురు? అనుపమ రతిలాలసయగు మదాలస నే కొండఁ జేర్తురు?

ఇంద్రు:— బ్రహ్మర్షులారా? మున్ను మీరాచరించిన యవివేకములన్నియు, మీరుమీరే, వెలిఁబెట్టికొని పరుల హేళనకు గురియగుదురేల? "తాఁబట్టినదే రంభ. తామునిఁగినదే గంగ" యను భూలోక లోకోక్తికి నిదర్శనముగ నున్నది మీచర్య; చాలు - చాలు ఊరకయుండుఁడి. భారతీదేవిచే, శిక్షింపఁబడిన యీ పుంజికస్థల నాట్యనైపుణ్యము నేత్రానందముగఁ గందము?

దుర్వా:— మంచిది యటులొనర్తము.

( పుంజికస్థల నాట్యమొనర్చుచుండును. )

దుర్వా:—(లేచి) విశ్వామిత్రా! చూచితివే దీనిపదవిన్యాసంబు.

సీ. భాసురస్ఫారపదవిన్యాసంబుఁగంటివే
[illegible] హాసఁగల్పించు నన్యాసికైన

విశ్వా:—( దుర్వాసునిఁ గూర్చుండఁబెట్టును. )

( పుంజికస్థల నాట్యమారంభించును. )

దుర్వా:—( ఆహా - భళిరా - భలా. )

మంజులమంజీర శింజితంబులుగుంజు
యోగ్యైకగురుస్తైన భోగమునకు

విశ్వా:— దుర్వాసా! ఈ నటనవలదు. కూర్చుండుము.

దుర్వా:—( కూర్చుండును. )

( పుంజికస్థల నాట్యమాడును. )

దుర్వా:—( విశ్వామిత్రునిఁజూచి ) సఖా!

చిలుకలకొలికి, యా, కులుకులుగంటివే
చిలుకులై కలఁచెను చిత్తమెల్ల

విశ్వా:— దుర్వాసా! ఇంచుక యూరకయుండుము: కూర్చుండుము.

( పుంజికస్థల నాట్యమారంభించును. )

దుర్వా:—( మఱలలేచి ) ఔరా! దీనిహావాయలు.

శంకరుస్తైన పశంకరుఁజేయురా
కంకణారావము కలయవినుమ

విశ్వా:— దుర్వాసా! ఉన్మాదునివలె నటించుచున్నావు. పలదీచర్య. ఊరక కూర్చుండుము.

( పుంజికస్థల నాట్యముచేయును. )

దుర్వా:—( దానిసమీపించి భలాయని పిల్వఁజాలచి )

గీ. అంగవిభ్రమమహార యనంగసంగ
రమున కావ్యానలేఖమై రమ్యగతిని
చెలఁగుచుండెడు నీచెలి చెలువమునకు
గానసామ్యము త్రిజగానఁగాన, నిజము.

( అనుచు నాట్యముఁ ద్రొక్కును. )

సరస్వతి:—( ఫక్కునసవ్వ ) నాథా! చూచితివియా యీ ఋషిపిచ్చి?

దుర్వా:—( కోపమున ) ఔరా! ఈ భారతిదుర్గర్వము? ( సరస్వతినిఁజూచి ) ఓసీ దురాత్మురాలా! నన్నుఁజూచి పరిహసించెదవా? బ్రహ్మనుఁ గూడినమాత్రాన బ్రహ్మపదవి నీకబ్బెనని తెలిసికొంటివియా? సిగ్గులేక కన్నతండ్రినిఁగూడిన నీవు బ్రహ్మర్షినగు నన్నవమానింపఁదగునా?

ఇది కేవలము ఋషిప్రకృతులకుఁదగిన యాచారము గావున నీవు ధరణిని నీచనరుఁడవై పుట్టి ఖరములఁ గాచుచుందువు. అపుడు నీకు బుద్ధివచ్చును.

శా. ఔ నేభారతి! ధాతదారవయి వాగాడంబరత్వంబునన్
మౌనీంద్రున్ ననుఁగాంచి నవ్వనగునే? మాన్యంబె! యీ వృత్తినిన్
బూనన్ గర్వము హెచ్చెనే! యతివరుల్ పూజ్యుల్ గదా! నీచతన్
దీనత్వంబునఁ బూరుషుండవయి ధాత్రిన్ బుట్టుమా వైశమే.

బ్రహ్మ:— దుర్వాసా దుర్వాసా! ఏమియిది? ఎంతటిశాపమిది? వెనుకముందారయకైతివి. ధూర్తత్వమున శపించితివి. బ్రహ్మర్షులు గుమిగూడియుండు సభామధ్యమున, లజ్జాభయంబులువీడి, వెలచేడియపై వలపుఁగొని, యున్మాదునింబలె నటింపసాగితివి. నీ కోపాటోపంబు నకు వెఱచి సభ్యులు నోరుమూసికొనిరి. స్త్రీ ప్రకృతి కావున సరస్వతినవ్వెను. అంతమాత్రాన నింతటిశాపమియ్యనగునా? చిరకాలార్జిత తపఃఫలంబు నీఁగనగునా? ఈ పాపఫలంబు నీవనుభవింతువు. నా ప్రాణదయితను నానుండి బాపి భార్యాభర్తల వియోగమునకుఁ గారణభూతుఁడవైతివి.

సావిత్రి:—ఓరీ దుర్వాసా! కామాద్యరిషడ్వర్గంబును జయించి, శమదమాదులమించు నీవు, కేవల నరుల రీతిఁ గామాదులకులోనై క్షీరనీరన్యాయముననుండెడి యీ దంపతుల వియోగాగ్నినిఁద్రోసితివి కావున నీవు తాపసికై యుండఁజనదు. వియోగంబెంతటి యుగ్గలంబగు వ్యథయనునది నీవెఱుంగవు కావున దానిననుభవించుటకై నీవు ధరణీతలంబునఁ దరుణివైపుట్టి నీచజాతిలోఁ బురుషాకృతినందిన యీ సరస్వతి సతివై, పురుషసమాగమంబున వియోగబాధచేఁ గుందుచు విదుమలందుచుఁ బడమినిఁ బడియుందువు.

కం. సతిపతులను నెడఁబాపిన
యతివరుఁడగునీవు శాపహతుఁడవగుచు నా
క్షితిదోమ్మరవానికిని
సతివై విరహాగ్నిఁగ్రుంగి చరియింపుమికన్.

దుర్వా:—సావిత్రీ! నీవుగాయిత్ర్యధి దేవతవని బ్రహ్మర్షులెల్లరు నినుఁబూజింతురను గర్వంబున నిక్కినీల్గుచు, రెండవరుద్రుఁడనని వన్నెకెక్కిననాకు శాపంబియ్యనోపితివి కావున నీకును నేనిపుడు ప్రతిశాపంబిచ్చెద.

కం. సావిత్రీ! గర్వించుచు
నీవిధముననాకు శాపమిచ్చుకతమునన్
నీవాజగతినిఁబుట్టుము
స్త్రీవయి యపుడందుదీవు శిక్షాప్రాప్తిన్.

బ్రహ్మ:— ఏమి దుర్వాసా! నేఁడు నీవింతటి కోపాటోపంబునఁ బ్రజ్వరిల్ల నారంభించితివి. అందఱికి శాపంబిడ నారంభించితివి: ఇది దురాప పాపంబని యెఱుఁగనైతివి. నీ తపంబు బూడిదలోఁ జేసిన హోమంబయ్యె. ఛరకంటకుఁడవగు నీవు మనసేమి చనవేమి ఛీ ఛీ.

దుర్వా:— ఏమీ! విధాతా! వేదవేత్తవగు, నీవుసైతము కెంగలిఁబోలె నటించుచున్నావు కావున దేహాధి కారంబున నీవుండఁజనదు.

ఉ. దారను వెన్ను వేసుకొని తాపసవర్యుని నన్ను దిట్టితే
యౌర, విధాత; నీవరయ బాగను? మత్తిలి మాటలాడితే
భూరితపఃఫలంబుగను పూజ్యుని నన్ను నిరాకరించితే
ధారణిఁ బుట్టి జ్ఞాతిఖరవండన పాల్పడి యుండుమీవికన్.
మర్యాద లేని యీ సభ నుండఁ బ్రయోజనంబు లేదు పోయెద.

( నిష్క్రమణము. )

బ్రహ్మ:— (ఆలోచనసభినయించి) ఈ దుర్వాసుని దౌష్ట్యము దుస్సహమైనను సకారణంబుగ నున్నదని నాకుఁదోఁచెడి. భూలోకమున దేవభాష బొత్తిగ నశించుచున్నది. మున్ను శ్రీమన్నారాయణుఁడు వేదవ్యాసావతారంబున భూలోకంబున జనించి వేదోద్ధారకుఁడైనరీతి నేనిప్పుడు సంస్కృత భాషోద్ధారకుఁడనై భువిజనించుట ముఖ్యముఁగనున్నది. మీమీ శాపోపహతికై మీరును భువిజన్మించుఁడి. ఈ సరస్వతి పురుషాకృతి నీచజన్మమందినను దేవివరమహిమంబున రసపుష్టిగఁ గావ్యనాటకాదులనురచించి సంస్కృతభాష నుద్ధరించును. బ్రహ్మర్షులారా! మీ వియోగంబు నే సహింపఁజాలను. కావున మీరును ధరాతలంబున సంస్కృతపండితులగుచు నన్నుఁ జేరియుండుఁడి. యథోచిత కర్మఫలంబనుభవింప మనమెల్లరము భూలోకంబుఁ జేరుదుము. రండు.

విశ్వా:— [ పుంజికస్థలనుఁజూచి ] పుంజికస్థలా! మంచి పాట్యవైపుణ్యముఁ జూపితివి: మా మౌనసస్థలంబులందుఁ జిచ్చు రగిలింపఁజేసితివి రమ్ము. పోవుదము.

[ నిష్క్రమణము. ]



# కాళిదాసనాటకము.

## ప్రథమాంకము - ప్రథమరంగము.

ముంజ:— చేసినకొనినది, యనికొనినట్లు, లాకొను. చిరకాలాపేక్షిత ఫలంబిప్రుడుగదా నాకబ్బినది యము తటస్థించెను. విక్రమార్కాధిష్ఠిత సింహాసనంబున చేనధిపనింప నకుయు మెప్పడెప్పుడు వచ్చునాయని యువ్విడులూరుచుంటిని. కాలక్రమాగత కులాచారపద్ధతి ననుసరించి నాయన్న పెద్దవాడగు కారణంబున నతఁడా సింహాసనమెక్కెను. అధివ్యాధులచే నక్కాలి పెద్దకాలము బుగద్దశమునెను. రాజ్యాదార్య సాహస స్థంభమ్ముడతఁడు కావున దతినిని దుడిముట్టింపఁ నా యొనర్చిన కర్మములన్నియు నిష్ఫలమాయెను. భువకు దైవదోహంబుననో, నా భాగ్య వశంబుననో, నాయన్న యంతరించెను. ఇప్రుడు మరిష్టకార్యంబునకు భంగకారిగ నాయన్న కొమారుఁడు భోజుఁడున్నవాఁడు. ఆ బాలుఁడు మునినంతవలకు నాసిపతే మవలంబించి జనులు నాకు విరుద్ధులగుదురు. వారిని దండనార్హులనుకేసెన. మంత్రియు సేనాధిపతియు నా బాలునిపైఁ ప్రేమఁబూనిరను కారణంబున, చేదోరయుకే నెపమున వారిని నింద్యారోపితు లనుకేసి, దేశభ్రష్టులఁజానించితి. వారిపదవులందు నామిత్రుల నుంచితి. ఇప్రుడు నావిషయ మెవరును మాటలాడ భీతులగుచున్నవారు. నేనే సింహాసనమెక్కి రాజానయ్యెద.

కం. రాజానయి రాజ్యమేలెద
భోజుని సమవర్తిపురికిఁబోనడఁచెద, నే
నీ జనుల దండనావిధి
భాజనులనుజేసిమించి శాసింతుధరణ్.

ఇట్లు నేయకున్న రాజ్యము నా వంశమునకు నిలువదు.

[ నిష్క్రమణము. ]

## ద్వితీయరంగము.

### ఆస్థానము.

ముంజరాజు - బ్రహ్మశాస్త్రి - దుర్బుద్ధి - దుశ్శాసనుఁడు
దుర్ముఖుఁడు - వీరయోగి - భోజుఁడు - కంఠీరవుఁడు - భటుఁడు.

ముంజ:— ఏమోయి బ్రహ్మశాస్త్రీ! నాకుఁ బట్టముఁగట్టుటకు నేలయాలసించెదవు?

బ్రహ్మ:— ముంజరాజా! ఇది త్యాజ్యకాలంబు గావున నాలసించితిని. ఇఁక రెండుగడియలు నెమ్మదిం డినచో శుభకాలంబాసన్నమగును. వీల వేగిరపడిరెదవు? చేతనున్న కతి భాతికిరాదా?

ముంజ:— బ్రాహ్మణా! వాతికో వాంతికో యీ యుక్తిప్రసంగము నీకేల? పేరునకొక బ్రాహ్మణుఁ డుండవలెనని పెద్దఁజేసి నిన్నుఁ బిలిపించినందులకు సహంకరించి తలఁ గొట్టించుకొనుచున్నావు.

దుర్బుద్ధి:— ముంజరాజా! మీయన్న సింధులుఁడు రాజపురోహితునిఁగ వీనినుంచికొని తనభాండాగారము నందలి విశేషద్రవ్యము వీనికిచ్చెను. అదిచాలక, వెలగల ఫలవంతములగు భూములు దాన మిచ్చెను. పొట్టక్రొవ్వి యెవరిలక్ష్యము లేక వీఁడు విక్కి వీఁగుచున్నవాఁడు.

ముంజ:— దుర్బుద్ధీ! అటులైన వీనిసిరిసంతయుఁ గొల్లఁగొట్టి రాజ్యధన భాండాగారంబుఁ జేర్పుఁడి. భూములు లాఁగికొనుఁడి.

దుర్బు:— చిత్తము.

బ్రహ్మ:— మహాప్రభూ! విలికల, యోగక్షేమంబారయువాఁడను నేనుగాన త్యాజ్యకాలములో సింహాసనాధిష్ఠోత్సవము నూతనముగఁ జేయఁగూడదని నేఁబల్కితినిగాని వేఱుతలంపునఁగాదు. అదిమీకు సమాధానముకాదేని యిపుడే మంగళాచరణము గావించెద.

ముంజ:— మంగళమువలదు. మంగలమువలదు. వెళ్లిపొమ్ము. వెళ్లెను.

బ్రహ్మ:— [ స్వగ. ] వీనికే మోవినాశకాలము సమీపించినది. కాదేని బ్రహ్మద్వేషంబింతగఁ గలుగునా? [ నిష్క్రమింతుఁడగును. ]

దుర్బుద్ధి:— మహీపాలా! ఆలస్యమేల? సింహాసన మలంకరింపుము. నేనున్నవాఁడను. సేనాని దుశ్శాసనుఁడున్నవాఁడు. సేనయంతయుఁ గావలిగ నిలిచినది.

ముంజ:— ఎక్కెద [ మొదటిసోపానముపై నడుగిడ ]

కం. అంజక పీఠంబెక్కఁగ
నంజయిడకు ముందుమించి యవివేకుఁడవై
ముంజా! నాహితమును విను
రంజనచెడుఁ జేటు మూడురా నిక్కముగన్.

సా॥సా॥భ॥:— ముంజా! అంతక యీ దివ్యపీఠంబాసింపకు. ఈ సింహాసనంబు విక్రమార్కునంతటి కార్యాచార్య సాహసవంతులే యెక్కఁదగినది.

ముంజ:— [ మిట్టిపడి మెట్టుదిగి ] ఈ యమంగళోపశ్రుతి యెచ్చటనుండివచ్చెను? ఇది నాకుఁగాని వారి కుట్రయని తోఁచెడు. దీనిని నే లెక్కసేయను. సింహాసనమెక్కెద, [ అనుచు రెండవ మెట్టునెక్కును. ]

సాలభంజిక:— కం. ఎక్కకుమెక్కకు ముంజా
దక్కదు సింహాసనంబు ధారుణినీకున్
జక్కఁగ వినుమా హితమును
స్రుక్కకయుఁక మరలిచనుమ సువిచారుఁడవై.

ముంజా! ఎక్కకెక్కకు. నీవు విక్రమార్కునంతటివాఁడవుకావు.

ముంజ:— మరల యశరీరవాక్యంబువచ్చెను. ఇది యెచ్చటిదియో తెలియదే?

దుర్బు:— (నలుదిక్కులుఁజూచి) మహాప్రభూ! నలుదిక్కులఁజూచితిని. ఎవరును లేరు.

ముంజ:— ఇట్టివానికి భీతిలుట రాజలక్షణముగాదు. పురుషలక్షణమునుగాదు. సింహాసనమిపుడే యె క్కెదు. (అనుచు నెక్కఁబోవును.)

గీ. దివ్యసింహాసనంబిది దేవతాంశ
సంభవుఁడుగాని పురమందు సాహసించి
యెక్కెనేనియు వానికినుక్కుదక్క
ముమ్మరమ్ముగు దుర్మరణమ్ము నిజము.

సాలభ:— వలదు వలదు. ముంజా! ఎక్కవలదు.

ముంజ:— ఎక్కిన నేమగును?

సాలభ:— ప్రాణహానియగును.

ముంజ:— ఎవరినుండి?

సాలభం:— నీనుండియె.

ముంజ:— హా! నానుండియే నా ప్రాణంబునకు హానికలుగునా! ఎటుకలుగునో చూచెద. (అనుచు సింహాసనమెక్కి)
మంత్రీ! దుర్బుద్ధీ! నేనింతటినుండి రాజనగుదును. సింధులునిపై విశ్వాసభక్తులచే జనులు బాలుఁడగు భోజునిపక్షమువలంబించి నన్నెదుర్తురు. దేశక్షోభంబగును. కావున నిప్పటినుండియు, నాకీరనన సింహాసన్నముగనుండులాగు నెట్టియొక నైపమున జనుల దండించుచుందుము.

దుర్బుద్ధి:— మహాప్రభూ! పుట్టలోని చీమలబలె కోట్యానుకోట్లుగఁగల జనులనుదండించి నోరుమూయుంచుట సులభసాధ్యము కాదు. సులభముగ మనచేతిలోనుండు కార్యమునకు ఇంతగఁ గష్టపడ నేల?

ముంజ:— మంత్రీ! అట్టి సులభమైన కార్యమెద్ది?

దుర్బుద్ధి:— మహాప్రభూ! ఎవరునెఱుంగనటుల భోజునిపనిరేయి, కుదిముట్టించినచో దలఁ గష్టమెల్లఁదీరును గదా? అపుడు సింహాసనమధిష్టింప మీకే క్రమమైనవారసులనియెంచి జనులు నోటిలో నువ్వుగింజలు వేసుకొని చచ్చినట్లు పడియుందురు.

ముంజ:— [ఆలోచించి] భళా! మంత్రీ! నీబుద్ధికుశలత, నీ యాలోచన ననుసరించి చేయ, నమ్మిక బంటొకఁడు గావలయునుగదా?

దుర్బు:— మహాప్రభూ! అట్టివారు నాచేతిక్రింద ననేకులుగలరు. కావలయునన నొకనిని పిలిపించెద.

ముంజ:— అటులైన నీవే కారాగృహమునకుఁబోయి రహస్యముగ భోజుని నిచటికిఁ బిలుచుకొనిరమ్ము.

దుర్బు:— చిత్తము. [అని నిష్క్రమించును.]

ముంజ:— [భటునింజూచి] ఓరీ! భటా! నా కొమారుఁడగు కంఠీరవుని నిచటికిఁ బిలుచుకొనిరమ్ము.

ముంజ:--- భోజా! నోరుమూసికొని పడియుండుము. ప్రల్లదంపుఁ బలుకులుపలుకకు.

భోజ:--- నిజమాడితిని. ఇందుప్రల్లదమేమున్నది?

ముంజ:--- భోజా! నోరుమూయుము. నీ యవివేకము మానుము.

భోజ:--- నా మాటల నే యవివేకమును లేదు.

ముంజ:--- చాలు చాలు. పెద్దవారియెదుట వచ్చినవానింబలె, బడియుండక యధిక ప్రసంగములు చేయుట యవినయము. (యోగినిఁజూచి) యోగీ! వీనికి నాయుఃప్రమాణ మెంతయి న్నదియో చూతువు?

భోజ:--- ఆయుఃప్రమాణంబుఁ దెలుపఁగూడదని విధియున్నది.

ముంజ:--- బుద్ధిహీనుఁడా! ఆ యధికప్రసంగము నీకేల వలదు.

యోగి:--- ఆయుఃప్రమాణంబుఁ దెలుపఁగూడదని యమునియాజ్ఞ.

ముంజ:--- యోగీ! వీఁడు దీర్ఘాయుష్కుఁడా?

భోజ:--- పెద్దల నిట్టిది నిర్బంధించి ప్రశ్నించుట మర్యాదకాదు.

ముంజ:--- ఓరీ! మందమతీ! నీహితము నాకువలదు.

భోజ:--- హితోపదేశంబు విననినరుఁడు వానరుఁడగును.

ముంజ:--- విధవా! నోరుమూయుము.

భోజ:--- నోటికొచ్చినమాటలాడి నీ యవివేకము వెలిబెట్టకు.

ముంజ:--- ఇది నీతప్పుగాదు. నిర్భాగ్యులగు నీ తలిదండ్రులతప్పు.

భోజ:--- ఏమీ! ఏమిమర్యాదయిది? ఏమిమాటలాడితివి? చచ్చి సుఖమున స్వర్గమునను న్న నా తలిదండ్రులను దూషించెదవా? ఔరా! నీ కావరము?

కం. చెడుగా! చచ్చినవారిని
దుడుకుతనంబునను బలుకదోషముగాదే?
చెడునుడువులిఁక నుడివినఁ
గడువడిగాఁ గత్తిరింతుఁగత్తిని జిహ్వన్.

ముంజ:--- హా. హా, నీవబాలకా; మత్తిలిమాటలాడెదవా? (దుశ్శాసనునిఁజూచి) దుశ్శాసనా! ఈ పొగరుపోతునుఁ గొనిపోయి కారనుంపుము. శీఘ్రమ్మయీడ్చుకొనిపొమ్ము.

భోజ:--- ఓరీ బుద్ధిహీనా! నీమోముఁ జూచుచునిచటనుండుటకంటెను కారాగృహమేనాకు సుఖము కావున, పోనేపోయెద (నిష్క్రాంతుఁడగును)

యోగి:--- రాజా! బాలుని బాధించుట ధర్మముకాదు. ఏతప్పునెరంచియెఱుంగని బాలుని దండించుట ధర్మముకాదు.

కం. ఖలవృత్తిని నీవీగతిఁ
గులశేఖరుబాలునిటులఁ గూల్తురె కారా

చలమా! నీకిదిఫలమా
పలదయ్యా పలదు కాలువదలుము క్రీలిక.

ముంజ:— ఓరీ; పరదేశజోగీ: నీకేల యింతటి యధికప్రసంగము? సకలదేశాధిపతియగు నాచర్య విచారపాత్రుఁడవగుని వధిశిక్షింపనగునా? సన్యాసినిగావున నిన్నువదలితి. వెడలిపొమ్ము.

యోగి:— ఓరా కండకావరమున గన్నులుగానక పెద్దలను దూషించెదవా? ఇపుడే నాకాశాగ్నినిన్నుఁ బ్రోసిభస్మము చేయనెంచితి. నీదుష్కృత్యమును దిమ్మలోనే నీవుబడియుండుట మేలని వదలితి.

చం. ఘనులగు వారిమాటలను గాదని హీనునికాఁడిక్కెఁబెక్కగాఁ
జనునె? దురాపపాతక విచారపయోనిధి మున్గనావే! ఛీ
కనులకుఁగావరంబెగయఁగప్పఁగ మిన్నునుమన్నుఁగాన వీ
వనయముగాన దుర్మరణమందుమ దుర్గతిఁగూలుమావెసన్.

(నిష్క్రాంతుఁడగును)

ముంజ:— (దుర్బుద్ధినిఁజూచి) మంత్రీ! ఈబికిరంపు జోగిమాటలు వింటివిగదా; వీనినిరహస్యముగఁబట్టి యటవిఁజేర్చితలఁగొట్టుము. అబాలుని భోజుని యమునుందివంబుఁ జేర్పమేని జనులకుంబి మనకే పాయముకలుగును.

దుర్బు:— మహాప్రభూ: ఆపనినన్నుఁగలసినది. మీకావిచారంబు వలదు. వలయుఁ సన్నాహము నేయు దము. రండు పోవుదము.

(నిష్క్రమము)

## తృతీయ రంగము.

వీరయోగి - కరాళుఁడు - భోజ - మంత్రి బుద్ధిసాగరుఁడు - సేనాని.

వీ॥ యో॥ ( స్వగతము )

శ్లో॥ ఫలమలమశనాయ స్వాదు పానాయతోయం
క్షితిరపిశయనార్థం వాససేవల్కలంచ
నవధనమధుపాన భ్రాంతసర్వేంద్రియాణా
మవినయమనుమంతుంనోత్సహే దుర్జనానాం.

(భర్తృహరి)

అమానవాధముఁడగు ముంజరాజు, తనయన్నకొడుకగు భోజునకురాజ్యభద్యుతి కలిగించుట యగాక కారాగృహంబునఁగారియలు బడఁజేసెను ఆశిశువుయొక్కయుసువులు వెననా ర్పయత్నించినాఁడాపకువనిక దాపదంతి? బాలునిహస్తలక్షణంబులు నేఁజూచుతిటి, మతి రుద్ధియు విచారింపక వాని యాయుఃప్రమాణంబెంతయని యడిగెను. బాలునిఁజంపఁ బ్రయత్నించుచున్నవాఁడు రాజగుటకు సందియంబు లేదు. సింధులుని మంత్రి బుద్ధిసాగరుఁ

మును, సేనాధిపతియు మారువేషములు ధరించుకొని సంచరించుచు భోజునికారణమంది వెలిడియుద్యమించుచున్నవారని విన్నాడు. వారిప్పుడెచటనున్నవారో తెలియదు. బోరికలేని నాయోగమహిమంబున జాడివారికుండ బాలుని బాధలనుండి తప్పించుమార్గంబు జేయుచుంటిని. వాఁడు దీర్ఘాయువుకావున వానికెవరినుండియు మరణంబురాదు............

ఏమీ: ఎవరిదో కాలుచప్పుడై యగుచున్నది. ఈయర్ధరాత్రినిచటికి మెల్లగనడచి వచ్చువాఁడెవఁడుండును? నేనిచటకేదాగి కనిపెట్టెద. [ అరుగుదాఁగికొనియుండును. ]

[కరాళుఁడు నిద్రబోవు భోజునెత్తుకొని ప్రవేశము.]

కరాళుఁ:— ఈపసిబాలుఁడు తనకుగలుగఁ జావుమరణవార్తయించుకైనను తెలియక సుఖముగ నిద్రించుచున్నవాఁడు. మూంజునియాజ్ఞ నెఱవేర్చుటకిది మంచి సమయము. బాలుఁడు లేచియుఱవనటుల యొకదెబ్బకే వీని శిరమును దెగవేయవలెను [అనుచుఁ గత్తి యెత్తును.]

[బుద్ధిసాగరుఁడును సేనానాయకుఁడును ప్రవేశించి]

సేనా:— [కరాళునివెనుకనుండి చేఁబట్టి] ఓరీ! ఓరి చండాలా! నీచేతికత్తిఁ బదపైచెదవా? వేయవా? వేయుదేని నీ ఖడ్గము చేతనే నీశిరముఁ గత్తరించెద.

కరాళు:— ఓయయ్యో. వదలితిఁగత్తి. నన్ను వదలుఁడు.

సే॥ నా॥:— [కరాళునివదలి] ఓరీ ఈ క్రూరకృత్యమొనరింపుమని నీకానతి యిచ్చినవారెవరు?

కరా:— దేవరా ముంజరాజే బాలునిఁజంపుమని యానతినిడెను?

బుద్ధి:— ఆదుర్మార్గునికృత్యంబని నేననుకొనియుంటిని.

వీరయో:— (ప్రవేశించి) అనుకొననేల? ఆచండాలునిదే యీ కృత్యము. నాయెదుటనే యీ బాలుని దండించినీని యూయమెంతయుని యడిగెను.

భోజ:— [ నిద్రలేచి నలుదిక్కులవలోకించి వీరయోగినిఁ జూచి నమస్కరించి ] మహానుభావా నేఁడాస్థానమున భవద్దివ్యదర్శనంబు నాకునయ్యెను. అపుడు నాపినతండ్రి నన్ను గారాబద్ధునిఁ జేసెను. అచటనుండి నేనీయడవికెటు చేరితిని? తామేలయిటువచ్చితిరి?

వీ॥ యో॥ బాలకా! ఇదియంతయును చండాలుండగు నీపినతండ్రి దుష్కృత్యము. నిన్నుఁ జంపఁదలంచి యీ యంధకారంబునఁ గ్రూరకర్ముండగు ఘాతకున కప్పగించినాఁడు. ఇవ్వార్త నీతండ్రి మంత్రి సేనాధిపతులకుఁ దెలుపవలెనని యీయడవిఁ జేరితిని. ఘాతకుని కృత్యంబు నాకెరుకనుండెరో దైవయోగంబునవచ్చి నీయాపదఁదొలఁగించి నిన్ను గాపాడితిని.

భోజ:— ( మంత్రిసేనాధిపతులకు వందనంబిడి ) బుద్ధిసాగరా! వీరనాయకా! నా పినతండ్రిచే దేశభ్రష్టులఁగాంచి మీరు పరదేశవాసులైతిరని చింతించుచుంటిని. మీరేల యిటువచ్చితిరి?

బుద్ధి:— భోజరాజా! నీ పినతండ్రి ముంజుఁడు నీకుఁ బ్రాణాపాయంబుఁ గలిగింప, దురాలోచన సేయుచున్నాడనివిని నిన్నుఁ గాపాడుటకై మారువేషములఁ, నీ ప్రాంత్యంబున సంచరించుచుంటిమి. కరాళుఁడు నిన్నెత్తికొనివచ్చినపుడే వృక్షముచాటున దాఁగితిమి. వాఁడు నీపైఁ

యుండెంతపాపిరో. తనశిష్యురాలగు మదనసేనను మోహించిబలాత్కారముగ నయినబట్టి భోగింపవలెనని యత్నించుచున్నవాఁడు. ఈవిషయమెట్లు పరిణమించునో చూచెద. వీనికి నేఁడొసంగులుఁ బోసంగునటులఁజేసి మూలల బ్రహ్మలోకంబుఁ జేర్పవలెను. భోజుఁడీప్రస్తు మహిమపురి రాజ్యంబేలుచు సుఖమున నున్నవాఁడు. వానిని ధారానగరంబునకు రప్పించి, విక్రమార్కుని సింహాసనంబధిష్ఠింపఁ జేయవలెను. ఇదియుకర్తవ్యాంశంబు.

(ఒకపిచ్చివాఁడు పాటలంబాడుచుఁ బ్రవేశించును) ఈ పిచ్చివాఁడొక్కొక్కతఱి నున్మాదుఁడుగను(In sane) కొన్నిసమయములందువివేకిగ [Save at lucid interwals] నుండును.

పిచ్చివా:— హో. హో వాఁడంతరిక్షమునకున్నాఁడు. అదిగో, మిణుకుమిణుకుమని మెరయుచున్నవాఁడు. వానిని మ్రింగను రాహుకేతువులు మేఘరూపమున సమీపించుచున్నవారు. ఏదీ తారారూపము. పోయెనే. ఎచటికిఁబోవుదు? భూమికిదిగెనా? అదిగోయందున్నది నాయనా; రమ్ము ఇచటికిరమ్ము రమ్ము నీనగుమోమును జూపుము! చూపుము! అటులేల మోము త్రిప్పితివి. కోపమా! నాపైఁగోపమా! ఎచటికిఁబోఁబోదవు. పాతాళంబునకుఁ బోయినను నేను నిన్ను వదలుదునా? ఇదిగో నేను నీవెంటనంటి నిన్నుఁబట్టెద. [అనుచుఁబఱుగిడుచుఁబోయి] యోగినిఁ బట్టును

యోగి:— నీ వెవఁడవు? నన్నేల పట్టెదవు? వదలుము.

పిచ్చివా:— వదలను. నీవు నా వెంటవచ్చి మార్తవరాజ్యసింహాసనంబెక్కువరకు నిన్నువదలను వదలను.

యోగి:— ఓరీ నేను యోగిని సన్న్యాసిని.

పిచ్చివా:— చాలులే నీమోసపుమాటలు. యోగులనిపేరుపెట్టుకొని మోసగించి జీవములు దోఁచు వారిని నే ననేకులను జూచినాను.

యోగి:— ఓరీ పిచ్చివాఁడా! నన్నుదృష్టించి చూడుము.

పిచ్చి:— ఎవఁడురాపిచ్చివాఁడు? నీవుపిచ్చివాఁడవు నీయబ్బపిచ్చివాఁడు. నీతాతపిచ్చివాఁడు. ఈప్రపంచములో నేనొక్కఁడ నేవివేకిని. మిగతవారందఱును పిచ్చివారేను. గనుఁబోలఁ మోసగాండ్రకు యోగముపిచ్చి. కొందఱికిఁ జదువుపిచ్చి. కొందఱికిధనముపిచ్చి. వ్యాపారముపిచ్చి కొందఱికి వ్యవహారము పిచ్చి కొందఱికి కొందఱికి స్త్రీలపిచ్చి. నాటలపిచ్చి కొందఱికి ఆటలు చూడవలెనను పిచ్చికొందఱికి. కొందఱికి వేదాంతముపిచ్చి. కొందఱికిసంసారముపిచ్చి. ఈరీతిగఁ బ్రపంచమంతయును పిచ్చితోనిండినది. నేనొక్కఁడనే పిచ్చిలేనివాఁడను. హి హి హీ హి [అనినవ్వును]

యోగి:— నీవు పలుకునదంతయును నిజము అయితే నీవు చెప్పిచేయించిన యథార్థపుఁబిచ్చివాఁడు. నీవెవఁడయినది నాకుఁ దెలియును. అయినను నానినుండియే నానివృత్తాంతంబువిని రోయెద. [పిచ్చివానిఁజూచి]




# కాళిదాసనాటకము.

ద్వితీయాఙ్కము — ప్రథమరంగము

ఉపాధ్యాయుఁడగు గౌతముని యిల్లు

ఉపా:—[స్వగతము] శ్లో॥ స్మితేన భావేనచ లజ్జయాచ
పరాఙ్ముఖై రర్ధకటాక్ష వీక్షణైః।
వచోభిరీర్ష్యా కలహేన లీలయా
సమస్తభావైః ఖలుబంధనం స్త్రియః॥

రాజసుతయగు మదనసేన నాయొద్ద సకలశాస్త్రంబులు గ్రహించెను. ఇప్పుడా సుందరాంగికి యౌవనదశ ప్రారంభించుచున్నది. మొదట నాయొద్ద విద్యాభ్యాసంబునకుఁ జేరినప్పుడు నా సరసంజేరి మేనంటుకొని గూర్చుండుచుండెను. అక్కాలమున వామనము సమ్మోదవార్ధిలో మునిఁగి తేలుచుండెను. రాఁగారాఁగ దానియవయవాభివృద్ధి యయినట్టెల్లను దానికొక లజ్జయను చెలికత్తె యెచటినుండియో వచ్చి యదృశ్యముగ దానిం జేరినది. అది మొదలు పాఠములు గఱచునపుడు దూరదూరముగనుండును గాని యెంతబలవంతపెట్టినను సమీపమునకు రాదు. బలవంతముగ కెట్టఁబట్టిలాగిన మందస్మితము మాని కోపమించుక పూనినదానివలె నటించును. ఇదికదా స్త్రీదయొక్క కుటిలవర్తనము. ఆ మదనసేన సౌందర్యమెంతవర్ణించినను దక్కువయని నేనెన్నెద. ఆ బింబాధర ముద్దుమోము వెన్నెలరేనిని సన్నగిలఁజేయును. ఆ వారిజాయతనేత్ర ధవళాయత చంచలనయన పద్మములు, పద్మములను నీటిలోఁ జపంబొనర్పఁజేయును. ఆ నెలఁతను నే వర్ణింపఁజాలను.

" కిమిందుః కింపద్మం కిము ముకురబింబం కిముముఖం
" కిమబ్జౌ కింమీనౌ కిముమదన బాణౌ కిముదృశౌ॥
" ఖగౌవా గుచ్ఛౌవా కనకకలశౌవా కిముకుచౌ॥
" తటిద్వా తారావా కనకలతికావా కిమబలా॥

అని బిల్హణుండు వర్ణించిన యామినీపూర్ణతిలక యందమును మించు సుందరాంగి యీ మదనసేన, ఆ మదనసేనకుఁ జదువు చెప్పునప్పుడు దానిమనోజ్ఞ విలాస వైఖరులు నామదినిఁ గలంచసాఁగెను. అప్పుడా యసమానమన్మథు నిందుకొఁగిటఁబొదువ నుపక్రమించి యనర్థకారణంబని బుద్ధితెచ్చుకొనుచున్నాను; నన్నుఁబోలె నా మదవతి హృదయమును మదనుఁడు గలఁచఁజేయునని పలువిధముల దానిని దూఱుచుండును. ఆ సరసిజాక్షి నా సరసనుండుతఱి

గుణ:— ఇంకేయబద్ధమున్నది? సర్వము దక్షిణార్థమేను. ఇన్ని దినములు రాజతనయగు మదనసేనను మనఃపూర్తిగ మీరు శిక్షించిన ఫలము నేడను భవింతురు మీకు శోభనమగును?

ఉపా:— ఏమీ! ఏమీ. నాకు శోభనమగునా? ఎవరీప్రయోజనము కుదిర్చిరి?

గుణ:— రాజుగారు.

ఉపా:— రాజుగారు కుదిర్చిరియా? సంతోషము. సంతోషము. గుణమాలీ! ఏసందర్భమున రాజుగారీ మంగళకార్యంబు కుదిర్చిరో వివరముగ దెలుపుము విని సంతసించెద.

గుణమా:— బ్రాహ్మణోత్తమా! మదనసేన యౌవనవతి యయినది కదా?

ఉపా:— అవును. అయినది,

గుణ:— రాజస్త్రీలు యౌవనప్రాదుర్భావమయిన తోడనే వివాహయోగ్యలగుదురు కదా?

ఉపా:— నిజము. సరియయిన క్షత్రియవరున కైనను, బ్రాహ్మణవరునకైనను నిచ్చి వివాహము నొనర్పవలెనని విధియున్నది,

గుణ:— రాజపుత్రికలకు యౌవనము కలిగిన తోడనే, వారిని అంతఃపురంబున నుంచవలెనని విధియున్నది కదా?

ఉపా:— అట్టివిధి యుచ్చటను లేదు. అది పాడు బాతుక.

గుణ:— ఆ విధిననుసరించి మదనసేన యింతటినుండి యంతఃపురంబున నుండవలెనని యానతిచ్చినారు.

ఉపా:— (వెలవెలబోయి. తొట్రుపడుచు) గు. గు. గుణమాలీ! ఇంతటినుండి మామదనసేన యిచ్చటికి రాదా?

గుణమా:— ఉపాధ్యాయులవారూ: మీరేలయంతగ ఖిన్నులగుచున్నారు? బంగారు పళ్ళెరంబులలో పదార్థంబులనిడికొని మనమదనసేన తమకు నివేదించుటకై యిప్పుడే వచ్చును.

ఉపా:— మదనసేన యింకను చదువవలసిన శాస్త్రమొకటి యుండెను.

గుణమా:— అదియేది?

ఉపా:— మదనశాస్త్రము

గుణమా:— ఆ శాస్త్రము మీరు మగనివద్ద నభ్యసించవలసినది కదా?

(వెలినుండి మంగళవాద్యము వినబడును.)

అదిగో మదనసేన వచ్చుచున్నది.

ఉపా:— గుణమాలీ: నా శరీరమొక తీరుగనున్నది శిరోవేదనబలమైనది. ఇంచుక శయనించెద. మదనసేన వచ్చినపుడు నిశ్శబ్దముగ నుండనిమ్ము.

గుణమా:— మంచిది స్వామీ: అటులనే యొనరించెద.

"స్వగ": ఇది శిరోవేదనయా! మనోవేదనయా? మనోజవేదనయా? ఎద్దియైన వాగానిచ్చు

సుధనః--- (ఆత్మగతము) నాగురువుల వారిమాటలు శృతిని మించి నాకు గానంబడుచున్నవి. నేడు వీరిని దారి నుండి తప్పింపవలెను.

[ ప్రకాశముగ ] స్వామీ! తమపూజకుఁగాను సర్వార్థంబులఁదెచ్చినాను. వేగమ్ముగొనినాకు సెలవిండు. నాతండ్రి నేఁటినుండియును నేనంతఃపురమునవసించులాగునవాజ్ఞయిడినాడు.

ఉపా.--- మదనసేనా! సకలశాస్త్రంబులు చదువకమున్నే నీకుఁజదువుచాలాయెనా?

మదనః--- స్వామీ! తమయనుగ్రహమువల్ల సకల శాస్త్రసారంబును తెలిసితినిగదా? " మదనసేనా " నీకునకలవిద్యలువచ్చెనని మీరేధృవానతిచ్చితిరిగదా?

ఉపా.--- నిజము నిజము. సకలశాస్త్రములు వచ్చెను. సాహిత్యమువలెనను సంగీతశాస్త్రము సమాప్త మాయెను భరతమార్గములాగ్రముగ నేర్పితివిగాని మఱియొక దేహసుఖసాధనశాస్త్రము మాత్రము నీవు తెలియవైతివి. నీపాండిత్యమునకునది యొకలోపమని నాకుఁదోఁచుచున్నది.

మదన.--- స్వామీ! అదియేది?

ఉపా.--- మర్మశాస్త్రము కళాశాస్త్రము. వాత్స్యాయనసూత్రములు.

మదన.--- స్వామీ! సమయమువచ్చినప్పుడా శాస్త్రము నే నేస్వంతముగఁజదువఁగలను.

ఉపా.--- అది పుస్తకపాఠ్యమగును. అనుభవశాస్త్రమది.

మదన.--- అయినుభవము వివాహానంతరమున రాఁదగినది. ఇప్పుడామాటలేల. నాయొసగ్గు సేవంగొని నాకు సెలవిండు. వైళమ్మె నే గృహమ్మునకుఁబోవలయును.

ఉపా.--- మదనసేనా! సేవయేమి?

మదన.--- స్వామీ! భక్తిపూర్వకముగఁదమకు హేమాభరణంబులును చీనీచీనాంబరములును నర్పింప వచ్చినాను.

ఉపా.--- [ నవ్వుచు ] మదనసేనా! ఎంతటివెఱ్ఱిదానవు నీవు. నిర్జీవపదార్థములన్ని యర్పించుటకం టెను కాంతియుతమగు నీ బంగారు మేనొక గడియనాకర్పించినఁ జాలుఁగదా. అదినీకు జ మగు భక్తి వెల్లడిపఱచును. ఆత్మసమర్పణముగదా ముఖ్యసేవ.

మదనః--- స్వామి: సకలశాస్త్రంబులఁ జదివినఫలమాయిది? శిష్యనగు నేను మీసుతనగుదునుగదా? మీరు నాతండ్రి వమానులగుదురుకదా!

ఉపా.--- అవును. అంతఃకరణ విషయంబున తండ్రిసమానుఁడనగుదును? ఇదియు నావాక్యము సన్వయిం చు క్రమము. ఇన్నిశాస్త్రంబులు చదివిన నీకు నీస్వల్పవిషయంబుఁ దెలియదా?

మదనః--- స్వామీ: మీసాహిత్య సామర్థ్యంబున లేని యర్థములున్నలాగు కల్పించెదరు. అర్థవాదం బున విధులనుల్లంఘించుట న్యాయము కాదు?

ఉపా:--- మరుతాపమున గురుపుత్రల్లవించుచుండ నతని యతను తను తాపంబుదీర్పనిది శిష్యురాలికి ధర్మ మగాదను.

మదన:— స్వామీ! ఇట్టిమాటలాడుట తగవుకాదు.

ఉపా:— మారువితగులములోఁ బడఁద్రోయుట నీకు హితముకాదు.

మదన:— మీవంటోలు విద్యార్థులకిది మార్గము కాదు.

ఉపా:— మారునిమార్గణంబులకు విద్యార్థులేమి తపస్వులన్నులేమి, లొంగకయుండరు. విశ్వామిత్ర పరాశరాదులేదీనికి నిదర్శనములు.

మదన:— స్వామీ! మీమార్గము నాకుహితవుగలేదు. మీమాటలతి కటువులుగనున్నవి. నాకురుచింపవు. నేనిచటనుండఁజాలను. నే వెళ్లిపోయెద.

ఉపా:— పూఁబోఁడీ! నీవెచటికివెళ్లిపోరాదవు. మారభూతావేశుఁడయి నీగురువు నిన్ను వెంబడించును. వదలఁడు.

మదన:— స్వామీ! మిమువంటి జ్ఞానులొక ధీరత్వముమాని మారునకులొంగి, పరస్త్రీని బలాత్కరించుట సరసము కాదు.

ఉపా.— మానినీ! జ్ఞానము కారణ్యమొనర్చి, ధీరత్వమును కవచముఁ ఛేదించి కారుణ్యవతుల శరణుఁజొప్పించుట మారునకు ధర్మముగాదు.

మదన.— స్వామీ! ఇఁక నాకాంతికి కాపము కలిగెను; మీమాటలు సైఁపఁజాల. నేవచ్చినవేళ మంచిది కాదు. ఇపుడుపోయి మరలివచ్చెద.

ఉపా.— నేనిపుడు మరులు హెచ్చి మరుని తాపంబునఁ దపించుచుండ నీవు మరలవచ్చుటేమి? నేవదలను (అనుచుఁ బైఁ బడనుంకించును)

మదన.— తప్పించుకొని యచటికచటికిఁ బరుగిడును. ఉపాధ్యాయుఁడు దాని వెంబడించును. మదన సేనా! రావే రావే మన్మథుఁడు పంచబాణుఁడై..............................

మదన.— దీనినుండి తప్పించు వారెవరును లేరైరి కదా? హా. గుణమాలినీ; హా నాయనా నాయనా.

విక్రమ.—(లోనుండి మదనసేనా! భయపడకుము. భయపడకుము. వచ్చితిని, వచ్చితిని, అనుచుఁ జేతఁ గత్తిఁబూని ప్రవేశించును) (వచ్చి, కూతురునుఁజూచి) అమ్మా! వెఱవకు. నిన్నెవరేమిచేసిరి? ఇంతగ వణఁకెదేల?

మదన:— (స్వగ॥ ఎటులయినను విద్యాగురువును రక్షింపవలెను. లేదేని బ్రహ్మహత్యవచ్చును) (ప్రకాశముగ) నాయనా! గురుపూజకై నేనిచటికివచ్చి యుండ నొక బ్రహ్మరాక్షసి విన్నువదలనని నావెన్నంటెను. భయపడి యఱచితిని.

విక్రమ:— జ్యోతిష్కుని మాటనిక్కమాయెను. తనయా! భయపడక గృహమునకు వెడలుము. నీచెలికత్తెలు వెలుపటఁగాచి యున్నారు.

మదన:— మంచిది నాయనా! అటులొనరించెద. (నిష్క్రమించును)

విక్రమ:— (గుమ్మములఁ జూచి) బ్రాహ్మణోత్తమా! వారినయుపరిక్షిన బ్రహ్మరాక్షసుని వార్త యేమి?

ఉపా:— మహాప్రభూ! బహుదినములుగ నాయింటనొక బ్రహ్మరాక్షసుఁడు నివసించియుప్రద్రవకరముగ నుండెను. నిన్నటిదినంబున దిగ్బంధనములొనర్చి యుచ్చాటన మంత్రంబులుచ్చరించుచుండ మనమదనసేన వచ్చెను. ఆబ్రహ్మరాక్షసుఁడా సుందరాంగిని వింబడించెను. కాఁబోలును!

విక్రమ:— ఉండునుండును. స్వామీ! నేనిటుచేరునపుడు, తాము "రావే రావే మన్మథఃపంచ బాణః" యనిపలుమారు పలవరించుచుంటిరే? ఏల?

ఉపా:— మహారాజా! నేనీపురి శృంగారంబు దర్శించుచు నొక కావ్యంబొనర్చుచుంటిని. అందు నీపురి స్త్రీలయందందిపుడే యొకశ్లోకంబున వర్ణించి నోటతో వర్ణించి నెమ్మదిగ వ్రాయవచ్చునని యెంచి నోటఁ బలుకుచుంటిని.

విక్రమ:— స్వామీ! ఆ శ్లోకమేమి?

ఉపా:— రాజా! తెలిపెదను వినుము.

" గేహేగేహే జంగమాహేమవల్లీ
" వల్ల్యాంవల్ల్యాం పార్వణః చంద్రబింబః
" బింబే బింబే కోకిలానాం విరావో
" రావేరావే మన్మథః పంచబాణః.

విక్రమ:— స్వామీ! ఈ శ్లోకార్థంబేమి?

ఉపా:— మహాప్రభూ! ఈ పురియందుఁ బ్రతిగృహమందును బంగారుతీగలు సంచరించుచున్నవి. ప్రతితీవెయందును సంపూర్ణ చంద్రబింబము విలసిల్లుచున్నది. ప్రతిబింబమునందును కోకిల మధురరవము వెడలుచున్నది. ప్రతిరవమునందును మన్మథుఁడు పంచబాణములు ధరించియున్నవాఁడు. ఈ పురియంగనల శృంగారమింతేగనున్నదని వర్ణించితిని.

విక్రమ:— ఔరా! కవివర్ణన లిటులుండవలెనా? పండితోత్తములారా! ఇంతటినుండి మీరు మాయాస్థానపుఁ బండితులై మాయున్నన లందుచుండుఁడి. నేఁ బోయివచ్చెద.

ఉపా:— అబ్బా గొంగుపోయి యంతకునియింటి యతిథినగుదుంటిని. దైవయోగమున వదిలిపోయెను. ముప్పంతిప్పనదియగాక నా విద్యాబలమున రాజసన్మానమునంది యాస్థాన ముఖ్యపండితుఁడనైతిని. ఇదికదా విద్యాప్రభావము. విద్యలేనివాఁడు రెండుకాళ్ల పశువుకదా; కావుననే భర్తృహరి విద్యామహిమ నీరీతిగ వర్ణించెను.

" విద్యానామ నరస్యరూపమధికం ప్రచ్ఛన్న గుప్తంధనం॥
" విద్యాభోగకరీ యశస్సుఖకరీ విద్యాగురూణాంగురుః॥
" విద్యాబంధు జనోవిదేశగమనే విద్యాపరాదేవతా॥
" విద్యారాజసు పూజ్యతేనహి ధనంవిద్యావిహీనః పశుః॥

(నిష్క్రమించును.)

## ద్వితీయ రంగము.

విక్రమరాజు - మదనసేన - మంత్రి - ఉపాధ్యాయులు - అంగ - వంగ
కళింగ - కాశ్మీర దేశపు రాజకుమారులు.

విక్రమ:— మదనసేనా! నీతో విద్యాప్రసంగము నొనర్చి యనేక రాజపుత్రులు నిన్ను జయింపలేక పరాజితులయిపోయిరి. మరల పలుగురు రాజపుత్త్రులు స్ఫురద్రూపులు, విద్యార్థులై నిన్ను వరింపవచ్చి యున్నారు. వలయునేని వారిని పరీక్షింపవచ్చును.

మదనసే:—తండ్రీ! పరీక్షించెద. ( అంగరాజ పుత్రునిఁజూచి ) రాజకుమారా! " విహస్య " యనునది యేవిభక్తి?

రాజు:— షష్ఠీవిభక్తి యనునది స్పష్టముగ నున్నదికదా?

మదనసే:—( వంగరాజ పుత్రునిఁజూచి ) రాజకుమారా! " విహాయ " యనునది యేవిభక్తి?

వంగరా:—చతుర్థీవిభక్తి యని దానిరూపమే తెలియచేయుచున్నది.

మదనసే:—( కళింగరాజపుత్రునిఁజూచి ) రాజతనయా! " అహం " యనునది యేవిభక్తి?

కళింగ:— " అహం " యనునది ద్వితీయ విభక్తి.

మదనసే:—( కాశ్మీర రాజునుజూచి ) రాజపుత్రా! " కథం " యనునది యేవిభక్తి?

కాశ్మీర:— ఏమీ! సకలశాస్త్రంబులును గరతలామలకంబుగఁ జదివిన నన్ను పిల్లవాండ్రనుంబలె విభక్తిని గురించి పరీక్షింపవలెనా?

ఉపా:— రాజకుమారా! పరీక్షించునప్పుడు ప్రారంభమునుండియుఁ బరీక్షింపవలెనని రాజపుత్రి యాశయము.

కాశ్మీర:— " కథం " యనునది ద్వితీయా విభక్తి యని చిన్నపిల్లవాండ్రు సైతము చెప్పఁగలరు.

విక్రమ:— అమ్మా! మదనసేనా! ఇఁక నేమైనను పరీక్షించెదవా?

మదనసే:—నాయనా! ఆదిలోనే హంసపాదముపడినది. ఇఁకఁ బరీక్షించుట యేమియున్నది. వీరిని సత్కరించి వారివారి దేశములకుఁ బంపుము.

రాజకు:—( వెడలిపోవుచు ) మమునెల్లర నవమానపఱచుటకై పిలిపించినట్టయినది మంచిది.

విక్రమ:— అమ్మా! నీవు విద్యాసంపన్నురాలయినది బహుజనులకుఁ గంటకముగనున్నది.

మదనసే:—నాయనా! నే నేమిసేయుదును.

" యస్యషష్ఠీ చతుర్థీస్యాత్
" విహస్యచ విహాయచ
" అహంకథం ద్వితీయాస్యాత్
" ద్వితీయస్యా మహంకథం.

నాయనా! "విహాస్య విహారియ" యను శబ్దము లెవరికి షష్ఠీచతుర్థీ విభక్తులయ్యెనో యొకరికి "నహం - కథం" యనుశబ్దములు ద్వితీయావిభక్తులయ్యెనో యట్టివారికి నే నెటుల ద్వితీయనగుదును?

విక్రమ:— ఆ విభక్తుల విషయముగాని శాస్త్రముల విషయముగాని నాకేమియును దెలియదు. బహుదేశపు రాజులచే నాకు మనస్తాపము కలిగినది. కావున నిపుడు నీ వివాహమునకునై నే నవలంబించిన మార్గము యుక్తముగ లేదు. స్వయంవరమును జాటించుట కర్తవ్యాంశంబని నాకుఁదోఁచుచున్నది. మంత్రీ! నీవేమనియెదవు?

మంత్రి:— మహాప్రభూ! ఈ విషయమునఁ దాత్పర్యమియ్య నే సంకోచించుచున్నాను. మనకుని చేతిలో వెన్నపిడికొని నేతికిఁగాను దేశదేశము వెదకువారివలె నున్నది.

రాజా:— అదియెటుల?

మంత్రి:— మహాప్రభూ! నాసుతుఁడు జయసేనుఁడు సర్వశాస్త్రములు చదివినవాఁడు. వయోవంతుఁడు స్ఫురద్రూపి. కులశీలములు తమకెఱింగిన విషయమేను.

రాజా:— ( మదనసేననుఁజూచి ) తనయా! ఈ విషయంబున నీ యభిప్రాయమేమి?

మదనసే:— నాయనా! నీ వడిగిన యభిప్రాయమును గుఱించి నేను రహస్యముగఁ జెలిపెదను.

రాజా:— ( మంత్రిని నుపాధ్యాయులనుఁజూచి ) కాఁదగిన కార్యము నేఁడేదియును లేదు. మీరు మీ మీ గృహములకు వెళ్ల నగును.

మం॥ఉ:— మంచిది. ( అనుచు వెళ్లి తెలియనటుల దాఁచికొనియుందురు. )

రాజా:— తనయా! మంత్రి పలుకులను గుఱించి నీ యభిప్రాయమేమి?

మదనసే:— నాయనా! నీ శాంతికి నే మెచ్చితిని. మంత్రి యట్టిమాటలాడినందులకు నీవే శిక్షవాట్లు పెట్టుదువని నేఁ దలంచియుంటిని. దానినిమాని నా యభిప్రాయం బడిగితివి. మంత్రి మనసేవకుఁడు మనమిచ్చు మాసవేతనముపై బ్రదుకువాఁడు. నెయ్యమునకు వియ్యమునకుఁ గయ్యమునకు సమతవలదా? ఇట్టి వివాహము లనర్థమూలకములగునుగాని సుఖమునఁ బరిణమింపవు.

రాజా:— తనయా! నీ యభిప్రాయంబు సమంజసముగనున్నది. నీ వివాహవిషయము నాకు నహోరాత్రములు బాధించుకారణంబున నెవరేమి పలికినను దానికి నియ్యకొనుచున్నాను. కానిమ్ము. ఎటులగునది యటులగును. మనము సేయఁదగినది యేమియున్నది. రమ్ము. గృహములోనికి వెళ్లుదము.

( నిష్క్రమింతురు. )

( మంత్రి యుపాధ్యాయులు మరలఁ బ్రవేశింతురు. )

మంత్రి:— గురువరా! చూచితిరా! ఈ మదనసేన గర్వము? నేను సేవకుఁడునఁట. మాసవేతనముల జీవించువాఁడనఁట. వియ్యమునకుఁదగనఁట. ఔరా దీని నిర్లక్ష్యబుద్ధి?

ఉపా:— మంత్రీ! నాకుఁ దెలియదయా? మొన్న మొన్నటివఱకు మదనసేన నా శిష్యురాలుగానే

యుండెనది. విద్య హెచ్చినకొల్ల వానికి గర్వము హెచ్చుచుండెను. తుదకు విద్యాగురుఁడవని నన్ను లక్ష్యపెట్టక తిరస్కరించుచుండెను.

మంత్రి:— పండితోత్తమా! దీనిగర్వమార్పవలెనుగదా?

ఉపా:— అదియెటు లొనఁగూడును.

మంత్రి:— దీనికొఱకు గాడిదలుఁ గాఁచువాఁడు భర్తగ నేర్పడవలెను.

ఉపా:— రాజాగారు స్వయంవర మేర్పాటొనర్ప నిశ్చయించిరిగదా?

మంత్రి:— ఆ యభిప్రాయమునుండి రాజాగారిని నే మరల్చెద.

ఉపా:— అటులయిన మీరు పలుకునట్టి వరుని నన్వేషించుపనికి నే సాహాయ్యపడెద.

మంత్రి:— అటులైనఁ బోవుదము రండు.

[ నిష్క్రమము. ]

## తృతీయరంగము.

మంత్రి - ఉపాధ్యాయుఁడు - డంబరవాఁడు.

డంబరవాఁడుపాటలుపాడుచుఁ జెట్టుపైనఁగూర్చుని తాఁగూర్చునిన కొమ్మను గొట్టుచుండుట.

(మంత్రి - ఉపాధ్యాయులు ప్రవేశింతురు.)

మంత్రి:— ఉపాధ్యాయులవారూ! మనప్రయత్నము లెల్లను విఫలములాయెను. సముద్రమునకేతము గట్టినట్లాయెను. బూడిదలో హోమముజేసినట్లాయెను. దేశదేశములు తిరిగితిమిగాని మనమనుకొనినట్టి వరుఁడు దొరకఁడాయెను. ఎచటఁజూచినను బుద్ధిగలవారున్నారుగాని మనకు వలయు స్ఫురద్రూపియుఁ దెలివిలేని మూఢ్డివాఁడును దొరకఁడు. ఏమిసేయవలెను? వ్యర్థులమైపోయినచో రాజేమనునోగదా? వ్యర్థమనోరథులమయి యుండుచుండవలసి వచ్చును. నాకేమియుఁ దోఁచదు.

ఉపా:— మంత్రీ! అంతలోనే యింతగ వేసరిల్లుటయవివేక లక్షణము. మనము ప్రారంభముననే చక్కఁగ నాలోచించియివ్వనికిఁ బూనికొనినాము కావునఁ దుదివఱకుఁ గార్యఫలమునకునై ప్రయత్నింపవలెను. ఈవిషయమున భర్తృహరి వచించిన శ్లోకము దెలిపెద దానిని జ్ఞప్తిలోనుంచికొనుము.

" ప్రారభ్యతేనఖలు విఘ్నభయేననీచైః
" ప్రారభ్యవిఘ్ననిహతావిరమంతి మధ్యాః
" విఘ్నైర్ముహుర్ముహురపి ప్రతిహన్యమానాః
" ప్రారభ్యముత్తమగుణానపరిత్యజంతి.

మంత్రీ! మనపనికి నెన్నియంతరాయములు వచ్చినను భయముండక కార్యశేఖరమగునంత వఱకుఁ బ్రయత్నించుట యుత్తమము. కావున ధైర్యమవలంబించి కార్యమొనర్పవలెను.

మంత్రి:—పండితులవారూ! మీరు పలికినది నిజము. అయితే సుఖముల కలపడినవాఁడు లేనిపనినీఁడల మైనవేసికొని దుఃఖపడుట కష్టముగదా? సుఖమున నింటనుండుట వదలి యీవిషమాటవులందు సంచరించుటమున తెలివ్రాఁతగనున్నది.

ఉషా:— మంత్రీ! తలఁచిన కార్యము ఫలింపఁజేయుటలోఁదటస్థించుసుఖదుఃఖములు మనముపాటింపఁదగినవి కావు.

"క్వచిత్పృథ్వీశయ్యః క్వచిదపిచ పర్యంకశయనః
క్వచిచ్ఛాకాహారః క్వచిదపిచ శాల్యోదనరుచిః॥
క్వచిత్కంథాధారీ క్వచిదపిచదివ్యాంబరధరో
మనస్వీకార్యార్థీ నగణయతి దుఃఖంనచసుఖం"

మంత్రివరా! కార్యార్థిగనుండు నీవు సుఖదుఃఖములు పాటించుటపాడిగాదు.

డంబర:—[చెట్టుపైనుండి] ఓ. ఓ. అబ్బలారా. దూరానపొండి. చెట్టుపడి అప్పచ్చురయ్యేరు. ఓ, మనిసీ. నీకేమిచెవుడా? సెప్పినదివినుము, మతీదగ్గిరికి వస్తావా? చస్తావు మాను. ఎఖిది ఇంతసెప్పినను వినవు? దూరానపో. దూరానపో. మీరేమి గాడిదలా, దయ్యాలా. ఓ. ఓ.

మంత్రి:—పండితులవారూ! ఏమియాశ్చర్యము! [అనినలుదిక్కులఁజూచును]

డంబర:—ఓ. యబ్బడూ! ఆకసముతట్టు సూడోయి కిందేమి సూసేవు?

మంత్రి:—ఏమది? ఎక్కడఁగానరాదే? [దిక్కులుచూచును.]

డంబర:— సీ; పిసినోడా! ఆకసముసూడుమంటె బూమమ్మను సూసేవు. సస్సేవు సస్సినమీదట సెప్పలేవ నేవు అనుచుఁచెట్టునఱుక నారభించును.

ఉషా:— చూచితివియా! మంత్రివరా! చెట్టుచివరన నెవఁడో యొక్కని కాఁబడియుడవను భీతిలేక క్రింది కొమ్మను గొట్టుచున్నాడు. వీఁడుకదా యవివేకులలో నగ్రేసరుఁడు.

మంత్రి:— చూడను మూర్ఖరూపిగ నున్నవాఁడు.

ఉషా:— ఇట్టివాఁడుకదా మనము కోరినవాఁడు.

మంత్రి:— వానిబుద్ధి నింకను పరీక్షింపవలెను.

డంబర:— ఐయి బూతాలా! నన్నుఁదివాలాయన్ని వచ్చారా! ఇందురా గొడ్డలితో నొకరయేసేసి సంపుతాను.

మంత్రి:— ఓరీ! మేము భూతాలుకాదు. దయ్యాలుకాదు. మనుజులము.

డంబర:— మనిసీయయితే సెట్టుకిందికెలవస్తావు? సావవా?

మంత్రి:— ఓరీ. క్రిందికిరమ్ము నీతోగొన్నిమాటలాడవలసినది.

డంబర:— నీయుకిత్తివాకుఁదెలుసులే. కిందోస్తే తిండా మంటావు. ఆదేవప్ప నీకిస్సినబుద్ధి నాకిస్సినాడు.

మంత్రి:— ఓరీ! మనష్యులను తినువారముకాము. అన్నము తినువారము.

మంత్రి:---ఓరీ! తెల్లనికాసులకేలనీకుఁజింత? మావెంటవచ్చిననీవు మోయునన్ని కాసులిత్తుము.

డంబరి.---నేమోయునన్ని కాసులిస్సేరా? ఏమో మీ యెత్తుగడసీన నన్ను పోలేరమ్మకు బలియిస్సే దానికి పిలిసికొనిపోతారనులాగున్నది. వల్లనబోచ్చేవల్లను. మాయమ్మ బువ్వకు కాసియుండును. మాగాడిదరంగనికి కాలువిఱిగినది. ఇంకొకకట్టుకట్టవలెను. నేఁబోయెదనావనికిళనెప్పల వలె యుద్దమురావద్దండి. నేపోవలెను.

ఉపా.--- ఓరీ! నీకు కాసులిచ్చుటయగాక రాజాబిడ్డనిచ్చి పెండ్లిసేయుచు నిన్నురక్షించెదము.

డంబరి.--- ఏమయాపెండ్లిసేసెదవా? రాసకూతురునిచ్చిపెండ్లిసేసెదవా? రాసకూతురేమి రూపము దఘా; నాకిపుడు మాటాడినపిల్లబలెనుందియా?

ఉపా.--- నీసుమాటలాడిన పిల్లయెటులున్నది?

డంబరి.--- సక్కఁగనున్నదయా అ. అ. సింతాకుకండ్లు. పొట్టి సేతులుకాళ్లు గరిసంటిసనుము సిన్న సిన్న యెంట్రుకలు పలురంగులమిట్టపండ్లు అ. అ. అ.పిల్లనడుస్తుంటే యాశబ్దమువిని కేరోరంత దానిసే మూసేదుసామీ. అయ్యా! మీరయేలోనిబిడ్డయెట్లాడిదయా?

ఉపా.--- ఓరీ! అంతటిచక్కనిది ప్రపంచమునందే లేదు. దానికండ్లుచేరడేసియున్నవి. ముక్కునువ్వుపువ్వునుబోలినది. రతనములబలె నుండునుపండ్లు. నడుమున్నదియో లేదోయనులాగున్నది.

డంబరి.--- చాలునయా! చాలును. నాకువలదు. వలదు. అట్టిపోలేరమ్మకునన్నుఁగట్టి, బలియిస్సేదానికి మూసేదుకదా; ఓయబ్బదూ; నేనురాను; రాను- రాను. పోయెద. రేపకడలేచి శనులమోర సూసిలి. విడవయా పోతాను. (అనుచుపోఁబోఁజూచును.)

ఉపా.--- మంత్రివరా! వీఁడుదండసాధ్యుఁడుగాని సామసాధ్యుండుకాడు.

మంత్రి.---[డంబరినిఁజూచి కొరడాకేలంబూని]. ఓరీ డంబరీ! మేము చెప్పినలాగున వినియెదవా! కొరడాదెబ్బలు కావలయునా?

డంబరి.---[వడఁకుచు] ఏమిమంతెప్పా. చెట్టుదిగివస్సినపో నీకేమికామ లేదనియుబ్బతోడు పెట్టితివే; [ఉపా. చూచి] ఏమోయి బాపనయ్యా! నీజంతెఘతోడేమాయెను? పానమిచ్చినను బాపనోణ్ణినమ్మరాదనునది నిజమాయెను.

ఉపా.--- ఓరీ! మామాటలువినిన నీకేభయములేదు. నిన్నొకరాజకుమారునిఁ జేసెదము. రాజూహుఁతురు నిచ్చిపెండ్లిసేయుదుము. నీవేరాజాగ రాజ్యమేలుదువు. సుఖముగనుందువు.

డంబరి:— అయ్యా! రాసబిడ్డఁదయ్యేద. రాజమేలెద. రాజబిడ్డనుమాత్రము వలదు. నాకు మా రంగి యున్నది.

మంత్రి.--- రంగిమాటయెత్తవలదు. డంబరవాఁడవను నీకులముకులచిపొమ్ము.

డంబరి:--- మేలయ్యా. నాకులముమరసేదెటులయ్యా; సక్కనిమారంగిని మరసేదెటులయా? అదినామనములోఁగూర్చుంది.

మంత్రి:--- ఎక్కడనైనను గూర్చునియుండనీ యుండనిమ్ము. నీవుమఱువవలసినదేను. అంతియగాదు నీకలిసంత్రులను మరవవలెను.

మంత్రి:—మఱపవా! [అనికొరడాఝెత్తును]

డంబరి:—నీకేల మంతెప్పా. అంత కోపము మరస్తాను.

మంత్రి:— అటులయిన రమ్ము పోవుదము.

డంబరి:—మంచిది.

ఉపా:— మంత్రివరా! వీనినిటులనే పిలిచికొనిపోయిన నెటులు? వీనికిమంచి బట్టలు తొడిగింపవలెను.

డంబరి:—ఏమయా! నాసన్నాశం నాయంగి-నాదుమాల బోచికొందురారేమి?

ఉపా:— వీనిని గాల్చివేయుదుము. రాజులు తొడగికొను బట్టలు వేయుదుము.

డంబరి:—ఏమయా! నాకువేసమువేసెదవా?

ఉపా:—నిన్ను రాజపుత్రునిఁజేసెదము.

డంబరి:—మంచిది. సేయండి. ఏమేమిసేస్తారో సూస్తాం.

మంత్రి:—పండితులవారూ! రాజుగారు రాజపుత్రి నమస్కరించినచో నాశీర్వదించునదెటులైనది చెప్పవలెనుగదా.

ఉపా:—చెప్పవలెను. ఆచదువైనను జెప్పకయున్నగతిరేమి?

డంబరి:—నాకుసదువా; వలదబ్బావలదు. సదివిన వానికంటెను సాకలిమేలు.

ఉపా:—ఓరీ! అటులనకు. రాజకూఁతురు చక్కఁగఁజదివినది. నీవునుగొంచముగ నైనను జదువవలెను.

డంబరి:—ఓయబ్బా ఆయమ్మ సదివినదియా. సదువురానోడు నేను. నన్ను సంసిమున్సిని? ఆడోరికి సదువువస్తే మగోరిని సంపుతారని మాయబ్బోడు సెప్పినాడు.

ఉపా:— ఛీ. మూర్ఖా! అటులనకు ఆఁడువారికిఁ జదువువచ్చినయెడల మగవాఁడు సుఖపడును.

డంబరి:—అబ్బో నన్నే మోసేస్తున్నారు. మారీసులుమీరు.

మంత్రి:—నోరుమూసుకొని యూరకయుండుము. లేదేని నీవీపుపై నీబెత్తమాడును.

డంబర:—వలదబ్బో వలదు. మీరు కొట్టవలదు. మీరురాకాసులు.

మంత్రి:—మూర్ఖా. నోరుమూయుము.

డంబరి:—[మంత్రినోరుమూసును]

డంబరి:—[విడిపించికొని] ఛీ. మూఢా; నీనోరుమూసికొనుము.

డంబరి:—చేతులతో నోరుమూసికొని నిలుచును.

మంత్రి:—ఓరీ! నీవేమిపిచ్చివాఁడవా! నోరుమూసికొమ్మనిన మాటలాడవలదని యర్థము.

డంబరి:— అటులనా? ఇఁకమాటలాడను.

మంత్రి:— ఓరీ! నీవురాజుగారి సభఁజేరినవు డెటులుందువు?

డంబరి:— ( మాటలాడక వంగి యుండును )

మంత్రి:-- ఓరీయటులకాదు. పీఠముపైఁ గూర్చుండవలెను.

డంబరి:---( నేలపైఁగూర్చుండి తలవంచికొనును )

మంత్రి:--- ఓరీ! తలవంచికొనవలదు. నిక్కికూర్చుండుము.

డంబరి:— ( నిక్కియాకాశముఁ జూచుచుఁ గూర్చుండును )

మంత్రి:— పైనఁజూడవలదు.

డంబరి:—( క్రిందఁజూచును )

మంత్రి:— క్రిందఁజూడవలదు నన్నుఁజూడుము.

డంబరి:-- ఏమి మంతెప్పా. నేతిలోసిక్కినావని పిల్లాటలుసేస్తావో? పైనసూడమంటావు క్రిందసూడమంటావు నిన్నుసూడు మంటావు నేనేమిసేయవలె సెప్పప్పా మాటలాడితే కొరడాయెత్తుతావు.

మంత్రి:— అనియన్నియనవలదు. చక్కఁగఁగూర్చుని మీసాలుతిద్దుచుండుము.

డంబరి:— నాకుమీసాలులేవు కదయ్యా.

ఉపా:— మంత్రివరా! వీణ్ణిబ్రాహ్మణునిఁ జేయుదము.

డంబరి:-- ఏమయా నన్నురాజకుమారుని సేస్తామని మొదటాడి యిప్పుడుబిచ్చమెత్తికొనితిను బాపనోణ్ణి సేసెదరా: మంచిమాటయిది.

మంత్రి:— ఎటులైననేమి నీకురాజుబిడ్డనిచ్చి పెండ్లిచేసినఁ జాలునుగదా?

డంబరి:— అంతేసరి.

ఉపా:— సభలోఁ గూర్చునినపుడు రాజునీకాళ్లపైఁ బడిననేమిసేయుదువు?

డంబరి:—సీ యనిరొయ్యగిసి మాగాడిద రంగనిబలెఁగాళ్లతోఁ దన్నుదును.

మంత్రి:-- గాడిదరంగని పేరుమఱువుమని పలుకలేదా? ( కొరడాయెత్తును )

డంబరి:—లేదయ్యా! లేదు. ఊఱకకాళ్లు జాడింతును.

ఉపా:— ఏమియుఁ జేయవలదు చేతులిటులెత్తి ( అభినయించిచూపును ) యాశీర్వదింపుము.

డంబర:—ఏమయా యీమాటలు నాకుఁదెలియవే.

ఉపా:— ఓరీనేనని నటులనుము.

డంబరి:— మంచిదియనిరెద.

ఉపా:— రాజునమస్కరించినపుడు ( అశ్వని, భరణి, కృత్తిక, రోహిణ్యాది నక్షత్రములు చెప్పించును )

డంబరి:-- ఈపేర్లునానోట మెదగవు.

ఉపా:— ఒకనెలదినములు నేర్పెదను నేర్చికొనుము.

డంబరి:— మంచిది.

ఉపా:— ఓరీ! రాజపుత్రి నమస్కరించినపుడే మనవలయునో తెలియునా?

డంబరి:— అనేదేమి. అటులచేపట్టికొని నుద్దుపెట్టికొని రమ్మనను.

ఉపా:— హెచ్చరిక యటుసేయుము "త్రిపీడాపరిహారోస్తు" యనియనుము.

డంబరి:— ఈయక్కరాలు యినుపగుగ్గిళ్లే నావంటికి మెదగవు.

ఉపా:— నేనెక్కుదిగ నేర్చి దనురమ్ము

మంత్రి:— ఉపాధ్యాయులవారూ! జందెము వేయను మఱచితిరే?

ఉపా:— అవునయ్యా! అవును. ఇపుడే వేసెద. ( అనుచుఁదన మెడలోనిదియొక పోగు వేయును.

డంబరి:— ఇదేమయ్యా; జమవ్వపానము. నామెడకురి వేయుదురారేమి?

ఉపా:— ఓరీ! ఇది బ్రాహ్మణ లక్షణము.

డంబరి:— ఏలక్కనమో నాకేమో యిదిగాలము నన్నేమో సేయుచున్నాడు?

మంత్రి:— ఓరీ! నోరుమూసుకొని మావీప్ర వెంటరమ్ము

డంబరి:— మంచిదిసామీ! మీవీపుమీదనే నాకాలు పెట్టును వస్తాను.

(నిష్క్రమము)

## చతుర్థరంగము.

### రాజభవనము.

విక్రమరాజు - మదనసేన - సీమంతిని - మంత్రి - ఉపాధ్యాయులు,
డంబర బ్రాహ్మణవరుఁడు - భటులు - చెలికత్తె.

రాజు:— ( ఉపాధ్యాయులనుఁ జూచి ) పండితవర్యా: వరాన్వేషణ మునకునై మీరు బహుశ్రమపడి యుందురు. నాకైమీరింతగ శ్రమపడినందులకు మీకనవరతము కృతజ్ఞుఁడనై యుండెద.

ఉపా:— మహాప్రభూ: బహుకాలము నుండియుఁదమ పోష్యవర్గములోఁ జేరినవారము. తినునదిమీ యన్నము. కట్టునదిమీబట్ట. ఇట్టిమేము తమకార్యము నిర్వహింపకున్న మాజన్మమొక జన్మమగునా?

రాజు:— భూసురోత్తమా! వరుఁడుసుస్వరద్రూపియా! విద్వాంసుఁడా?

ఉపా:— భూమిపాలా: ఆవరుఁడు రూపమున నవమన్మథుఁడు. ఇఁకవిద్యయందమో సరస్వతీస్వరూపమేను. మముఁబోలు వారతనివద్ద శిష్యులుగనుంటకు నైతము శక్తి వంతులముకాము. ఆవిద్వాంసుఁడు మితభాషి. మనబలె గ్రామ్యోక్తు లాడువాఁడుకాఁడు. గ్రామ్యోక్తులు వినిన నసహ్యపడును. మదనసేనవారినిఁ బరీక్షింపవలెనని నలవాటురీతిగ వ్యాకరణవిరుద్ధ శబ్దములా విద్వనోటినుండి వచ్చుచుండును. అదివిని యావిద్వాంసుఁ డసహ్యపడునేమోయని భీతిలుచున్నాను. అతనిభాష ఋగ్వేదముకంటెను ప్రాచీనభాష: అందునసంకేతాక్షరములచే మాట

లాడును. ప్రపంచమంతయును సంచరించి జలగడిగిలిమిగాని, యెుక్కఁడైనను మనమదనసేనకు దగినవరుఁడు దొరకఁడాయెను. మనపుణ్యవశమునఁ దుదకీబ్రాహ్మణవరుఁడు హిమాలయ ప్రాంతమున ఋషీశ్వరుల సంఘములోనుండెను. బహుకష్టపడి పిలిచికొనివచ్చితిమి. ఈవరుఁ డుదప్పినచో మనమదనసేనకు వరుఁడుదొరకుట దుర్లభమని నేఁదలంచెద.

రాజు:— అటులైన నేపరీక్షలువలదు. ( మదనసేనాయని పిలుచును ) ( మదనసేనయు, సీమంతిని చెలికత్తెయుఁ బ్రవేశింతురు ) మదనసేనా! నీకుఁదగిన వరునకుఁగాను వెదకివెదకి వేసరితిమి. బహురాజులతో ద్వేషము సంపాదించికొంటిమి. రాజపుత్రులలో నెవఁడునునీకుఁ దగినవరుఁ డులేఁడు. ఇపుడొక బ్రాహ్మణవరుఁడు స్ఫురద్రూపి యసమాన విద్యాన్వై పుణ్యముగలవాఁడు ఋషులసంఘములో దొరికెనఁట. కష్టపడి మనపండితులును మంత్రియును బిలిచికొనివచ్చినారు. ఈవరునిఁ బరీక్షించుట నేఁగోరను. ఒకవేళఁ బరీక్షింపనీవు దలంచితివేని నీమాటలలో వ్యాకరణ విరుద్ధమగు శబ్దమొకటియైనను జొరనటులఁ జూడుము.

మదన:— నాయనా: నీ యానతిరీతివర్తిల్లెద.

(మంత్రియు) డంబరబ్రాహ్మణుఁడును బ్రవేశింతురు. అందఱును లేచినిలుతురు.

రాజు.— బ్రాహ్మణోత్తమా: వందనములాచరించెద.

డం॥ బ్రా॥ (నేర్చికొనినవాశీర్వచన పాఠము మఱచి మిణకరించు చుండును. దానింగని)

ఉపా:— (పండితవర్యా! ఇతఁడశ్వతరువంశపురాజు)

డం॥ బ్రా॥:- (తెలివివచ్చినవానింబలెనటించి) అశ్విని పునర్వసు రేవతి కృత్తిక యనివచించును.

ఉపా:— [దూరమునవచ్చి] స్వగ! ఈబుద్ధిహీనుఁడు తానువర్ణించిన పాఠము మఱచి తలక్రిందుగనాల్గు నక్షత్రములపేర్లువచించెను. దీనిని సమన్వయించి సమాధానముచెప్పవలెను.]

రాజు:— పండితోత్తమా! ఈబ్రాహ్మణోత్తమునకు నేనమస్కరింప నాలుగు నక్షత్రములపేర్లు తలక్రిందుగనుడివెను. దానియర్థమేమి?

ఉపా:— మహాప్రభూ: ఈతని విద్యామహిమ యద్వితీయము. ఇతని భాష సూత్రప్రాయముగ సాంకేతికాక్షరములపై నాధారపడి యుండునని నేనుప్రారంభముననే తెలిపియుంటినిగదా: ఆనక్షత్రములపేర్లు వారుచ్చరించిన యర్థమును జెలిపెదనువినుము.

" అశ్వినీ భవతు తేతుమందురా మంది రేభవతు తేపునర్వసు
" రేవతీపతికనిష్ఠసేవయా, కృత్తికాతనయవిక్రమో భవక,

అనినీరియర్థము.

రాజ:— పండితులవారూ! తెనుఁగునస్పష్టముగశ్లోకార్థమును దెలుపుడి.

ఉపా:— మంచిది నీగుఱ్ఱముల యిల్లు లక్షణాశ్వములతో నిండునుగాత. నీగృహమునందు ధనసంపద మఱలమఱల నిండునుగాత. బలరామునితమ్ముఁడగు కృష్ణునిసేవవలన కుమారస్వామి యంతటి విక్రమవంతుఁడవై నీవు మనియుందువుగాత.

రాజు:— హా. హా. ఆనాల్గు నక్షత్రములలో నింతటియర్థ మీపండితులిమిడ్చిరికదా! మహనీయులు వీరు. ( బిడ్డనుఁజూచి ) మదనసేనా: ఈబ్రాహ్మణోత్తమ వరునకు నీపండితాగ్రేసరునకు వందనంబు లర్పింపుము.

మదన:— ( నమస్కరించును )

ఉపా:— రాజపుత్రి. బ్రాహ్మణోత్తమా! నమస్కరించుచున్నది, మంత్రి [ వెనుకనుండి పొడుచును ]

దం॥బ్రా॥ [ కోయనియులికిపడి ] "త్రిపీడాస్తు" యని యనును.

ఉపా:— ( దూరమునవచ్చి - స్వగతము ) ఈ విధవను "త్రిపీడాహారణమస్తు" అని పాఠము చెప్పియుండ "త్రిపీడాస్తు" యని యవలక్షణముగఁ బలికెను. దీనినెటులయిన సమర్థింప వలెను. ( ప్రకాశముగ ) మహాప్రభూ! ఈ పండిత మాన్యుని విద్యాగౌరవంబుఁ జూచితి రియా; నీ బిడ్డకు మూఁడుపీడ లెప్పటికి నుండునుగాతమని యాశీర్వదించెను. ఆ మూఁడుపీడ లేవియన.

"ఆసనే బాలపీడాచ శయనే పతిపీడతః ।
"భోజనే బంధుపీడాచ త్రిపీడాస్తు సదాతవ ॥

సుఖముగఁ గూర్చునినపుడు పిల్లలు తొడలెక్కి బాలక్రీడలు సలుపు పీడయును, శయనిం చునపుడు పతిపీడయును, భోజనకాలము నందనేక బంధువుల పీడయుం సదాకాలము నీ సుతకు నుండవలెనని యీ బ్రాహ్మణుని యాసీర్వచనార్థము.

రాజు:— ఔరా! ఈ పండితోత్తముని సామర్థ్యము. దీని చమత్కారము.

ఉపా:— ఇఁకను వీరి ప్రభావము మీ రెఱుంగరు. ముందు తెలియుదురు.

దం॥బ్రా:—ఓయి బోపనయ్యా! ఆ సిత్తారులో నుండేవాఁడు పది తలాల రాఘణుఁడా?

రాజు:— ఉపాధ్యాయులవారూ! వీరేమి రాఘణుఁడనుచున్నారు. వాని పేరు రావణుఁడుగదా?

ఉపా:— మహాప్రభూ! క్రమభంగ దోషమగునని వీరారీతిగ శబ్దముఁబ్రయోగించినారు. వీరు యాస్కా- చార్యుల మున్నన్న వ్యాకరణముల సైతముఁ దలక్రిందుగఁ జూచినారు. పులస్త్య బ్రహ్మ కుమారులు ముగ్గురుగదా? అందున.

"కుంభకర్ణే భకారోస్తి భకారోస్తి విభీషణే ।
"అగ్రజశ్చ స్వయంరాజా రాభణోనచ రావణః ॥

భూపాలా! ముగ్గురన్నదమ్ములలో కుంభకర్ణ శబ్దమునందు భకారమున్నది. విభీషణ శబ్ద మున భకారమున్నది. పెద్దవాఁడయ్యును, రాక్షసరాజయ్యును భకారములేనిది క్రమభంగ మగుకావున రాభణుఁడని దోషరహిత శబ్ద మువయోగించినారు. మహీపాలా! మన మదన సేన యీ వరుని నేమయినను పరీక్షింప నపేక్షించినఁ బరీక్షింపనగును.

రాజు:— మదనసేనా! నీవు పరీక్షింపఁదగినది యేమయినను నున్నదియా!

మదనసే:—( తల్లినిఁ బిలిచికొని దూరమువచ్చి ) జననీ! ఆ బ్రాహ్మణోత్తముని నేను ప్రారంభమునఁ జూచినపుడా మహాపురుషుని ముఖముమీద, సరస్వతి వీణనుధరించి తాండవమాడుచుండినరీతి నాకగపడెను. ఆ వరునియందు నాకెట్టిదియో యొకవిధముగ నుండెడి ననురాగం బుద్భవిల్లి నది. కావున నేనేమియును బరీక్షింపఁజాలను. ఇవ్వార్త జనకునకుఁ దెలుపుము.

సీమంతి:—( రాజును సమీపించి చెవులో నేమో చెప్పును )

రాజు:— ( మంత్రినిఁ బండితునిఁజూచి ) మంత్రివరా! పండితోత్తమా! ఈ బ్రాహ్మణవరుని నాపుత్రి పరీక్షించునదేమియును లేదఁట. నే ధన్యుఁడనైతిని. ఇఁక వివాహముహూర్తంబు త్వరలో నిర్ధరింపుఁడు.

ఉపా:— మహాప్రభూ! ఇపుడే మంచిముహూర్తము. రేపటినుండి రెండునెలలు మూఢముపచ్చును.

రాజు:— అటులైన నిపుడే ముఖ్యోత్సవము కానిండు. మిగతయుత్సవములు రిన్నఁగానగును. అమ్మా! మదనసేనా! ఆవరునిఁ బూలహారమున నలంకరింపుము.

మదనసే:—నాయనా! మంచిది. ( అనుచుఁ జెలి యందిచ్చిన పూలహారము వరుని మెడలో వేయును. )

ఉపా:— (మఱియొకహార ముపాధ్యాయుఁడు చేతనిడికొని వరునికేలునుబట్టి మదనసేన మెడలో బలవంతముగ వేయించును.)
మహీపాలా! ఇఁక నగ్నికార్యము సేయవలెను. అదియా సాయంత్రికానగును. తాము గృహమునకు వెళ్లవగును.

( రాజు - సీమంతిని - మదనసేన - చెలి - నిష్క్రమింతురు. )

మంత్రి:— పండితోత్తమా! ఇఁక మనపని సంపూర్ణమాయెనుగదా?

ఉపా:— సగమాయెను. ఇఁకఁ గష్టభాగము సగమున్నది.

మంత్రి:— అదియేమి.

ఉపా:— అగ్నికార్యము గృహప్రవేశము. అగ్నికార్య మగునంతవఱకుఁ బెండ్లి సంపూర్ణముకాదు గృహప్రవేశమయి వీరిరువురుఁ గూడునంతవఱకు వీని కులగోత్రములు మదనసేనకు రావు.

మంత్రి:— కావలెను. మదనసేన డంబరిది కావలెను. అపుడుగదా దాని మదమణఁగిపోవును.

డంబరి:— ఏమయ్యా! నా మెడనుట్టిది. ఈ పూల పానుకంపు నాకుఁ దలనొప్పిస్తుంది. ( అనితీసి యుపాధ్యాయుల మెడలో వేయును. )

మంత్రి:— ( కొరడాయెత్తి ) ఓరీ నోరుమూసికొని యూఱకుందువా? కొరడా కావలయునా?

డంబరి:— ఏమయ్యా! నే రాసల్లుఁడైతి. నీ కొరడా సూపేవు.

మంత్రి:— రాత్రివఱకు నోరుమూసికొని యుండుము. రేపటినుండి నీయిష్టము.

డంబరి:— మన్సిది. నే రాసయినపుడు నీయాట పట్టిస్తేనుశే.

( నిష్క్రమము. )

## పంచమరంగము.

### శయ్యాగృహము.

మదనసేన - డంబరి.

మదనసే:—[కూర్చుని తంబుర వాయించుచుండును. పాటలు పాడుచుండును.]

[ మంత్రి వెలినుండి డంబరిని లోనికిఁ ద్రోయును. ]

డంబరి:— అటులేల తోసేవు ముందెప్పా. ఇసట మాదేవుడున్నాడు.

మదనసే:—[ లేచి దూరమున నిలుచును. ]

డంబరి:— దూరాన నిల్చే వేల్నసే దాపుపురమ్ము రాలే, రమ్ము.

మదనసే:—[ స్వగతము ] ఏమీ! పండితోత్తముఁడయి గ్రామ్యోక్తు లిటులాడుచున్నవాఁడు. ఇది యేమో చిత్రముగనున్నది. [ భర్తనుఁజూచి ] నాథా! వచ్చెదను. ఆతురమేల. సంగీతము పైనఁ దమకు నపేక్ష గాఁబోలు పాడుదునా?

డంబరి:— పాడు సూతాము వింటాము.

మదనసే:—[ తంబూర వాయించుచుఁ బాడును. ]

డంబరి:— ఇదేమలే నాల్గేసి నరాలేసినారు. మా, వాదానికి యొకసరమేయుందును.

మదనసే:— నాథా! దాని పే రేకనాదమని యిచటఁ బిలుచుచున్నారు.

డంబరి:— ఏనరమో! మేమేమో దానిసే వాయిస్సేది. అదివాదిస్తుంటే వినుస్తుంటే జుమ్మంటుంది.

మదనసే:—[ స్వగ ] ఇతఁడేమో యవనిమనుజుఁడుగ నగపడెను. కొండజయులతోఁగూడి మాటలాడు చుండినందున నిట్టి గ్రామ్యోక్తులు వచ్చుచున్నవి కాఁబోలు [ ప్రకాశముగ ] నాథా! నీవు పాడఁగలవని తోఁచుచున్నది. ఏదీ యించుక పాడి శ్రవణానంద మొనర్పుము.

డంబరి:— అదియిటులే [ అని తంబురందికొని మూడుతంతులుతీసివేసి డంబరిపాట పాడుచు నవ్వుచుండును. ]

మదనసే:—[ స్వగ ] వీనిచర్యలేమో విపరీతముగనున్నది. [ ప్రకాశముగ ] నాథా! ఇంచుక ఫలాహారమిచ్చెద భుజింపుము.

డంబరి:— తేయులే తే నగ్గ పేసెద.

మదనసే:—[ లడ్డిచ్చును. డంబరి రొంతయిచ్చినను దినుచుండును. చక్కెలమిచ్చును డంబరి తినును. పిదపఁ బ్రాహ్మణముంటలిచ్చును ] అప్పుడు

డంబరి:— ఏమలే నాతో ఆసికాలు సేస్తావా! తింటానని మాగాడిద పెంటికలిస్సే వేల?

మదనసే:—[ స్వగ ] [ వీఁడు బ్రాహ్మణుఁడు కాడనునది స్పష్టమాయెను ] ప్రకాశముగ నాథా! నీరు సేవింపుము.

డంబరి:— [ నీరుఁద్రావి ] యతే! కల్లులేదా? దానిలోకదా రుసియుందును. కానిలే ఒకనాటికి లేకుంటేనేమి?

మదనసే:— వీఁడు కల్లుద్రావు కులమువాఁడనుట స్పష్టమాయెను, నాథా! అంగీవిచ్చుము. పరిమళ గంధము పూసెద.

డంబరి:— ఆదేమో యాడదే సూసెద.

మదన:—[ గంధపుగిన్నె యందించును ]

డంబరి:— [ గిన్నెలోచేయిపెట్టి వాసనఁజూచి ] తూ-థు-తూ-థు మాగాడిదరంగని గంజావాసన

యబ్బా - యబ్బా - ఎంతకంపో.

మదన:--- (స్వగ) వీడు గాడిదలకాచు వాడనునది స్పష్టమాయెను ఇంకను బరీక్షించెద ( నాథా: ఈభూమిమీదc గూర్చుండనేల? శయ్యపైనమ్ము. )

డంబరి:---( శయ్యపైc గూర్చుని లేచి ) సీ- సీ- ఒళ్లంతా దిగజార్తుంది నాకొద్దు నాబూముమ్మే నాకు బాగు. సక్కగ జంపువస్సును.

మదన:--- ( స్వగ॥ వీడేమోతెప్పి చేయించిన మోటువాడు, ) ప్రకాశముగ నాథా! తాంబూల మిచ్చెద స్వీకరింపుము.

డంబరి.-- ఛిదీ. తెమ్ము నమలెద.

మదన.--- తాంబూల మిచ్చును.

డంబరి.-- ఏమీ కర్లపాడి పొగాకులేదా? అదిలేని యాకొక్కల? రుసిరొమక్కనా?

మదన.--- ఇదిరేమిమోనిండు విపరీతము. మంత్రియు నుపాధ్యాయుడుc గుట్రపన్ని వీనిని నాకుc దగులc గట్టిరి. పాణిగ్రహణమయ్యెను. అగ్ని యెదుటc బ్రమాణములయ్యెను. విధినానొసట యీరీతిvrాసెను. కానిమ్ము వీనినోటినుండి నీవీదెవడయినదియుc దెలిసికొనిరెద. భర్తను శిక్షించిన పాపము నాకువచ్చినను రానిమ్ము. నేను శుద్ధాంతః కరణంబున నిప్పనిరొనర్చెదను.( కశc దీసికొనినిలిచి ) ప్రకాశముగ॥ ఓరీనీ వెవడవు నిజముc దెలుపుము తెలుపకున్నc గశతోనీవీపుc జీల్చెద.

డంబరి.-- అమ్మా! నీకాలికి మొక్కెను కొట్టొకు ( అనుచు మ్రొక్కును )

మదన.--- ఓరీ లెమ్ము నిజముపల్కుము, ప్రాణముదక్కించి కొనుము.

డంబరి.-- నాపానాలు తీస్తుందప్పా [యేడ్చును]

మదన.--- త్వరలో నిజము పలుకుము. కొరడా దెబ్బదు చేయును

డంబరి.-- అబ్బా - అబ్బా - మంతెప్పా బాపనప్పా మోసము సేసి నన్ను సంపిస్సేదా నికిటు తెస్తిరేమబ్బా (అలచును)

మదన.--- ఓరీ! అయినకు నీనోరుమూయుము. ఉన్న సంగతి యున్నట్లుల వచింపుము.

డంబరి.-- అమ్మా!

మదన:--- అట్లులనకు. దేవియనుము.

డంబరి:--- దేవీ. నాదేవీ! నాదైవమా. నేడంబరవాడను. నాదిగాడిదలు కాసుపని. కాలీకి సెట్టు కొట్టుసుంటిని. మంతెప్ప. బాపనప్పా వస్సినన్ను కొట్టి పిలిసికొనివస్సిరి. నాగొంతుకాయకు నుతిపేసిరి. (అనిజందెము చూపును) నాకేమేమో సెప్పిరి. రాచబిడ్డను పెండ్లిసేస్తామనిరి. బాము లేదనిరి. ఇపుడు సేయివిడిసి పేసిరి. ఏమిసేయుదు నే దేవి. నీవుకొట్టున్నావే! మాయమ్మదాపుకు పోతాను. వదలుము.

సీ. భూరిరాజ్యము నేలు భూభుజు సుతనైతి
గారాముబిడ్డనై గర్వ పడితి
సకలవిద్యలు నేను జక్కఁగఁ జదివితి
గురుల దుష్కృతికి నే దొరకనైతి
రాకుమారుల నెల్ల రాకొట్టి పంపితి
సుమతి దురాశకు సున్న యిడితి
ములచలకీటుకుల ములుకులఁ జిక్కితి
దంబరవానికి దారనైతి

గీ. పట్టణమువారి పరిహాస పాత్రనైతి
తల్లిదండ్రుల చింతకు దాననైతి
వ్యసనవారిధి మునిఁగితి వాసిచెడితి
ముందుతోఁపదు గతి యెంత మోసపోతి.

మదన:— [చింతించి కన్నీరు గార్చుచు నేడ్చుచు దీర్ఘాలోచనచేసి] పాణిగ్రహణమైనది. నా ప్రాణముండువఱకు వీఁడు నాకుఁదప్పినవాఁడు కాఁడు. ఈ వార్తవెలిపడినచో నగరులో నగుపాటగును. ధైర్యమవలంబింపవలెను. నాపురాకృత కర్మంబీభంగిఁబరిణమించినది. దీనిని దుడిచివేయ నావశమగునా? కర్మశక్తి, యతిప్రబలము.

" బ్రహ్మాయేనకులాలవన్నియమితో బ్రహ్మాండభాండోదరే
" విష్ణుర్యేనదశావతారగహనేక్షిప్తోమహాసంకటే
" రుద్రోయేనకపాలపాణిపుటకే భిక్షాటనంసేవతే
" సూర్యోభ్రామ్యతి నిత్యమేవగగనే తస్మైనమః కర్మణే,,

బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు నైత మీకర్మఫలంబుతప్పదు. ఇఁక నన్నడుగువారెవరు? చిన్న తనమునుండి, నే నుపాసించుకాళికాభవానిరయే, నాకిక్కాలంబునగతి. కావున నే నివుడు వీనింబిలిచికొని కాళికాదేవాలయంబుఁజేరెద. [డంబరినిఁజూచి]. ఓరీ! నావెంటరమ్ము.

డంబరి:— దేవమ్మా! ఎనటికి? మాయబ్బగుడిసకా?

మదన:— కాదు. కాళీదేవాలయమునకు.

డంబరి:— దేవీ! ఆదేవికి నన్ను బలియిత్తువా?

మదన:— లేదు. లేదు. నీతో నాదేవికిఁ బూజచేయింతును.

డంబరి:— మొన్న నే సుట్టాలొస్సినపుడు దేవికిపోతునటికి పూసింసినాను. మఱీయేమిసేవ. మనసుంచి నన్నువిడిస్తైనాయబ్బోని గుడిసకుపోతాను.

మదన:— ఓరీ! మాటలాడకు. కయ్యాక నావెంటరమ్ము. లేదేని నీవీపుఁజీర్చెద. [కొరడాచూపును]

డంబరి:—దేవీ! సంపకు. సంపకు. నీతో వస్సెద. వస్సెద.

మదన:— రమ్ము [అనికేల్పట్టియీడ్చును.]

డంబరి:— నల్లఁగవుంటిని వాఁగహాసారమిది [ఏడ్చుచుఁబోవును.]

[నిష్క్రమణము.]

## సప్తరంగము - కాళికాదేవాలయము.

మదనసేన - డంబరి. కాళిదాసు

మదన:—నాథా! ఈయాలయద్వారములు బంధింపఁబడినవి.

డంబరి:—కాలితోఁదన్ని పగలేయుదునా?

మదన:—వలదు. వలదు. ఇందుండియే దేవికి నమస్కరింపుము.

డంబరి:—[నమస్కరించును]

మదన:—ఓరీ! నీచెవులోనొక వాక్యంబు నెప్పెద. దానినివలుమాఱనుచు దేవిని ధ్యానించుచుండుము.

డంబరి:—మంచిది. అటుసేసెద [అనుచుఁగూర్చుండును]

మదన:—ఓరీ! గట్టిగముక్కుఁబట్టికొని దేవిపైననే మనముంచి ధ్యానింపుము. కనఁగవమూసికొనుము.

డంబరి:—(అటులొనరించుచు) అబ్బో ఊపిరాడదే.

మదన:— అంతగట్టిగఁబట్టవలదు. ఊపిరివిడుచుచుండుము.

డంబరి:—అటుసేసెద.

మదన:—(దేవికిమ్రొక్కి)

> " వాణీం, జితశుకవాణీ, మళికులవేణీంభవాంబుధి ద్రోణీం
> " వీణాశుకశిశుపాణీం నతగీర్వాణీం నమామిశర్వాణీం
> " కువలయదళ నీలాంగీం, కువలయరక్షైక దీక్షితాపాంగీం
> " లోచనవిజితకురంగీం మాతంగీం నౌమిశంకరార్ధాంగీం
> " కమలాకమలాకాంతా కలసారసదత్తకాంతకరకమలాం.
> " కరయుగళవిధృతకమలాం విమలాం కమలాంకచూడసకలకలాం
> " అరుణాధరజితబింబాం జగదంబాంగమనవిజితకాదంబాం.
> " పాలితసుజనకదంబాం పృథులనితంబాంభజేసహేరంబాం,,

అంబా! భువనేశ్వరీ. భవానీ! కాళీ; భక్తపరాధీనవని ప్రఖ్యాతిఁగాంచి నీభక్తురాలిననిప్ర దనుగ్రహింప,నిరాకరించితివేని నిదిగో నాకరాలంకారకర ధారచేనాశిరంబు నీకుబలియిచ్చెద.

కాళి:— (లోనుండి) భక్తాగ్రగణ్యా: మదనసేనా: నీ భక్తికిమెచ్చితి. నీయభీష్టంబెద్ది? వేఁడుము.

మదన:— అంబా: నావిద్యాగురువు మోసమున నీవిద్యావిహీనుని డంబరవానిని వివాహమాడితిని. ఈ నాపతి యసమాన పాండిత్యంబున యశమార్జించులాగు వరమిమ్ము. ఇదియనాయభీష్టంబు.

కాళి:— ఏదినీపతి. లోనికిఁబంపుము. (వాకిలినించుక తెరచును)

మదన:--- ప్రాణపతీ (లేపి) నీవు దేవాలయము లోనికిఁబొమ్ము భవాని నీకు విద్యాదాన మొసంగును.

డంబరి:-- అబ్బబ్బోవలదు. ఆదేవికిరక్తముపైప్రీతి నన్నుమింగును.

మదన:--- పిచ్చిపోఁడా: అటుసేయదు. నీకేభయమునులేదుఁ పొమ్ము.

డంబరి:---(వడఁకుచు లోపలికిఁబోవును. కాళి, యదృశ్యముగ వానినాలుకపై బీజాక్షరములు వ్రాయును)

(డంబరి వెలికివచ్చి కాళికినమస్కరించి)

" మాణిక్య వీణా ముపలాలయంతీం మదాలసాం మంజుల వాగ్విలాసాం
" మహేంద్రనీలద్యుతి కోమలాంగీం మాతంగకన్యాం మనసాస్మరామి॥

" చతుర్భుజే చంద్ర కళావతంసే, కుచోన్నతే కుంకుమ రాగశోణే॥
" పుండ్రేక్షుపాశాంకుశ పుష్ప బాణ,హస్తే నమస్తే జగదేక మాతః॥

" మాతామరకతశ్యామా, మాతంగీ మధుశాలినీ॥
" కుర్యాత్కటాక్షం కల్యాణీ, కదంబ వనవాసినీ॥

" జయమాతంగతనయే జయనీలోత్పలద్యుతే॥
" జయ సంగీ తరసికే జయ, లీలా శుకప్రియే॥

ద ం డ క ము.

జయజనని సుధా సముద్రాంత ఉద్యన్మణిద్వీప సంరూఢ బిల్వాటవీ మధ్యకల్ప ద్రుమాకల్ప కాదంబ కాంతార వాసప్రియే, కృత్తివాసః ప్రియే, సాదరారబ్ధ సంగీత సంభావనా సంభ్రమాలోల నీపస్రగాబద్ధ చూళీసనాథత్రికే, సానుమత్పుత్రికే, శేఖరీ భూతశీతాంశురేఖా మయూఖావళీనద్ధ సుస్నిగ్ధ నీలాలకశ్రేణి శృంగారితే, లోకసంభావితే, కామలీలా ధనుస్సన్నిభ భ్రూలతాపుష్ప సందేహ కృచ్చారు గోరోచనాపంక కేళీలలామాభిరామే సురామే,రమే ప్రోల్లసద్వాళికా మౌక్తికశ్రేణికా చంద్రికా మండలోద్భాసి గండస్థలవ్యస్త కస్తూరికా పత్రరేఖా సముద్భూతసౌరభ్య సంభ్రాంత భృంగాంగనా గీతసాంద్రీ భవన్మంత్ర తంత్రీస్వరే, భాస్వరే, వల్లకీవాదన ప్రక్రియాలోల తాళీదళాబద్ధ తాటంకభూషా విశేషాన్వితే, సిద్ధసన్మానితే, దివ్యహాలామదోద్వేలి హేలాల సచ్చక్షురాందోళన శ్రీసమాక్షిప్త కర్ణైక నీలోత్పలే, పూరితాశేషలోకాభివాంఛాఫలే శ్వేదబిందూ లసత్ఫాల నిష్యంద లావణ్య సందోహ సందేహ కృన్నాసికా మౌక్తికే, సర్వమంత్రాత్మికే, కుంద, మందస్మితోదారవక్త్రస్ఫురత్పూగ కర్పూర తాంబూల ఖండోత్కరే, శ్రీకరే కుందపుష్పద్యుతిస్నిగ్ధదంతావళీ నిర్మలాలోల కల్లోల సమ్మేళనస్మేర శోణాధరే, చా

రుచీరాధరే, సులలితనవ యౌవనారంభ చంద్రోదయద్వేల లావణ్యదుగ్ధార్ణావిర్భవత్కంబు బిబ్బోక హృత్కంధరే, మంధరే, బంధురచ్ఛన్న వీరాదిభూషా సముద్యోతమానా నవద్యాంగశోభే, శుభే, రత్నకేయూర రశ్మిచ్ఛటా పల్లవ ప్రోల్లసద్దోర్లతారాజితే, యోగిభిః పూజితే, విశ్వదిఙ్మండలవ్యాప్త మాణిక్య తేజస్ఫురత్కంకణాలంకృతే, సాధుభిస్సత్కృతే, వాసరారంభవేళాసముజ్జృంభ మాణారవిందప్రతిచ్ఛన్న పాణిద్వయే, సంతతోద్యద్దయే, దివ్యరత్నోర్మికా దీధితిస్తోమసంధ్యాయమానాంగుళీ పల్లవోద్యన్నఖేందుప్రభామండలే, ప్రోల్లసత్కుండలే, తారకారాజ నీకాశహారావళిస్మేర చారుస్తనాభోగ భారానమన్మధ్యవల్లీ వళిచ్ఛేదవీధీ సముల్లాససందర్శితాకార సౌందర్య రత్నాకరే, శ్రీకరే, హేమ కుంభోప మోత్తుంగవక్షోజ భారావనమ్రే, త్రిలోకావనమ్రే లసద్వృత్త గంభీర నాభీసరిత్తీర శైవాల శంకాకర శ్యామ రోమావళీ భూషణే, మంజుసంభాషణే చారుశింజత్కటీ సూత్ర నిర్భర్త్సితానంగలీలా ధనుశ్శింజినీడంబరే, దివ్యరత్నాంబరే పద్మరాగోల్లసన్మేఖలా భాస్వరశ్రోణి శోభా జితస్వర్ణభూభృత్తలే చంద్రికాశీతలే వికసితనవకింశుకాతామ్రదివ్యాంశుకచ్ఛన్న చారూరుశోభా పరాభూత సిందూర శోణాయమానేంద్ర మాతంగ హస్తార్గళే శ్యామలే కోమలస్నిగ్ధ నీలోత్పలా పాదితానంగ తూణీర శంకాకరోద్దామ జంఘాలతే చారులీలాగతే నమ్రదిక్పాల సీమంతినీ కుంతళస్నిగ్ధ నీలప్రభా పుంజసంజాత దూర్వాంకురా శంకసారంగ సంయోగ రింఖన్నఖేందూజ్వలే ప్రోజ్వలే దేవదేవే శద్రైత్యేశ యక్షేశ భూతేశ వాగీశ కోణేశ వాయ్వగ్ని కోటీర మాణిక్య సంఘృష్టబాలా తపోద్దామ లాక్షార సారుణ్య లక్ష్మీగృహీతాంఘ్రి పద్మద్వయే అద్వయే సురుచిర నవరత్న పీఠస్థితే సుస్థితే శంఖ పద్మద్వయోపాశ్రితే ఆశ్రితే దేవిదుర్గావట క్షేత్రపాలైర్యుతే మత్తమాతంగ కన్యాసమూహాన్వితే భైరవైరష్ట భిర్వేష్టితే దేవివామాది భిస్సంస్మృతే లక్ష్మ్యాది శక్త్యష్టకాసేవితే భైరవీసంవృతే పంచబాణేనరత్యాచ సంభావితే ప్రీతశక్త్యావసంతేన చానందితే భక్తిభాజాం పరంశ్రేయసే కల్పసే ఛందనామోజసే భ్రాజసే యోగినాం మానసే ధ్యాయసే గీతవిద్యాను యోగావితృప్తేన కృష్ణేన సంపూజ్యసే విశ్వాద్యేన గద్యేన పద్యేన విద్యాధరైర్గీయసే, యక్ష గంధర్వ సిద్ధాంగనా మండలైర్మండితే సర్వసౌభాగ్య వాంఛావతీ భిర్వధూభిస్సురాణీం సమారాధ్యసే సర్వవిద్యా విశేషాన్వితం చాటుగాథా సముచ్చారణా కంఠముల్లోల సద్వర్ణ రేఖాన్వితం

కోమలం శ్యామలోదార పక్షద్వయం తుండశోభాతి దూరీభవత్కింశుకాభం శుకంలాలయంతీ మివక్రీడసే, పాణిపద్మద్వయే నాపరేణాక్ష మాలాగుణంస్ఫాటికం జ్ఞానసారాత్మకం పుస్తకం బిభ్రతీయేన సంచింతసే తస్యవక్త్రాంత రాద్గద్య పద్యాత్మికా భారతీ నిస్సరే,ద్యేన వాఙ్మంసనా థాకృతిర్భావ్యసే సోపిలక్ష్మీసహస్రైః పరిక్రీడతే కింనసిద్ధే ద్వపుశ్యామలం కోమలం చారుచంద్రావ చూడాన్వితం ధ్యాయత స్తస్యలీలాసరోవారిధి, స్తస్య కేళీవనం నందనం, తస్యభద్రాసనం భూతలం తస్యగీర్దేవతాకింకరీ తస్యవాచాకరీ శ్రీస్స్వయం, సర్వయంత్రాత్మికే సర్వమంత్రాత్మికే సర్వము ద్రాత్మికే, సర్వశక్త్యాత్మికే, సర్వవర్ణాత్మికే సర్వరూపే, జగన్మాతృకే హేజగన్మాతృకే పాహిమాం పాహిమాం, పాహిమాం పాహిమాం.

కాళిలోనుండి

కాళి:--- భక్తాగ్రేసరా: నీయొనరించుస్తుతులు విని నేనమందానందనైతిని. నీయద్వితీయ విద్యావైభవంబున భరతఖండము నెల్లనుజయించి యశమార్జింపుము. అనేక కారణంబులచేతి జీర్ణమగుచున్న దేవభాష నుద్ధరింపుము. నీయం దెల్లకాలము నేనుండి నీకు భూతభవిష్యద్వర్తమానంబులు గోచరింపజేయుదును. నీకు యక్షరాక్షస పిశాచాదులనుండి యే భయమునులేదు. నీ యశమా చంద్రార్కము దిశదిశలు వ్యాపించియుండును. నీకు నేనభయమిచ్చినదానను. పొమ్ము. నీవు నా భక్తులలో నగ్రగణ్యుడవు కావున కాళిదాసుడని నామమంది ప్రఖ్యాతినిఁ గనుము.

కాళిదా:-- అంబా! నీ యానతిరీతి వర్తించెద. దిగ్విజయమునకునై పెడలెద! (మదనసేననుజూచి) తల్లీ! మదనసేనా! నీకు సాష్టాంగ దండప్రణామంబు లాచరించెద. (వందనంబులిడును)

మదన:— ప్రాణపతీ! ఇదియేమిచిత్రము. నేను నీప్రాణసతిని.

కాళిదా:--అంబా! అటులనకు దోషమువచ్చును. నీవు నాకు నీ దివ్యజన్మంబిచ్చినదానవు. లేకయున్న హీనజాతి డంబరవాడనై గొడిదలు కాచుచుంటిని.

మదనసే:-- నీవేకులమువాడయినను నీకు నేను సతి నేకదా!

కాళిదా:-- నీవు డంబరవాని సతివి. నేను డంబరవాడనుకాను. కావున నీవు నాకు సతివికావు.

మదనసే:—నీవేకులమువాడయినను నగ్నిసాక్షిగ నన్నుఁ బెండ్లియాడితివి. నేను నీకు నర్థాంగినై తిని. కావున మనమిరువురి ప్రాణముండునంతవఱకు మనము భార్యాభర్తలమగుదుము.

కాళిదా:—అటుకాదు. జన్మ జన్మములకు దేహములు వేఱగును. కర్మానుసారము గుణములు వేఱగును భార్యలు వేఱగుదురు డంబరవాని దేహముతో నీవు పోయినదానవైతివి. నేనీదేహమునకు నర్హమగు మఱియొక భార్యను పాణిగ్రహీతిగఁ జేసికొనవలని వచ్చును. ఇదియ, ధర్మ సూక్ష్మము.

మదనసే:— ప్రాణపతీ! నీ వాదములోఁ బెద్దదోష మొకటియున్నది. నీకు గొప్పుజన్మమిచ్చిన కారణంబున నీ దల్లినైతినని పలికితివి. వంబరతల్లికిఁ బ్రాహ్మణ పుత్రజన్మమిచ్చుటకు యోగ్యతగలుగునా? కలుగదు. కావున పతిజన్మమే సరిది. చక్కఁగ నాలోచింపుము.

కాళిదా:— (స్వగ) ఈ విషయము నావాదమునందు దౌర్బల్య మగపడుచున్నది. కావున వేఱొక వాదము చెదకెద) మదనసేనా! నీవు నాకు విద్యాదాన మొసంగితివి కావున నాకుఁదల్లివి.

మదనసే:— స్త్రీ తనపురుషునకు విద్యలభించునటుల చేయుటచే వారికిఁగల శారీరబాంధవ్యము మాఱదు. మాఱునని యేశాస్త్రమందును జెప్పఁబడలేదు.

కాళిదా:— విద్యాగురువు తండ్రియని శాస్త్రమున్నది. ఆ శాస్త్రము నాలోచించినచో విద్యాదాత స్త్రీ యయ్యోనేని తల్లియనుట స్పష్టము.

మదనసే:— లోకములో భార్యలు తమభర్తలకు ననేకవిషయములందు బుద్ధిగఱుపుచుందురు. అట్టి భార్యలందఱును భర్తలకుఁ దల్లులేనా? భర్తలకు భార్యలు బుద్ధిగఱుపుటతప్పా! ఇంతకు నీకు విద్యాదానమొసంగినది మనయిరువురకు జనని లోకజననీ భువనేశ్వరి యా కాళికాభవానికదా?

కాళిదా:— (స్వగతము) ఆఁడువారిని గెలుచుట కష్టము. వారు యుక్తికి మాఱుయుక్తి వెంటనే జోడించుచుందురు. వారితో మాటలాడినచో నెట్టివారైనను పురుషునిఁ దమవలలోఁ గెడపుదురు. కావుననే భర్తృహరి యీరీతిగ వచించెను.

" కామినీకాయ కాంతారే కుచపర్వత దుర్గమే॥
" మాసంచర మనఃపాంథ తత్రాస్తే స్మర తస్కరః॥ (భర్తృ)

కామినులతో నుండినచో స్మరతస్కరుఁడు నా మానస స్థైర్యధనంబును దోఁచికొనును. నా పూనిన దిగ్విజయ కార్యంబునకు నంతరాయంబు గలుగును. (ప్రకాశముగ) మదనసేనా! నీ వాదము యుక్తియుక్తముగ లేదు. కావున నే నిచటనుండను. పోవలయును.

మదనసే:— ప్రాణపతీ! నూతన పంచబాణా! నిన్నువదలి నే నుండఁజాలను నిలువఁజాలను మనఁజాలను. ప్రాణనాథా! నీ వియోగము నా కనలసంయోగమగును.

ఉ. మారుని మార్గణమ్ములిటు మర్మములెల్లఁ గలంపఁజొచ్చె; నో
మారసమానకాయ; నినుమానను, మానసనాథుఁడయ్యు నీ
తీరునఁ దీరమున్నగని తీక్ష్ణమునన్ బడఁ ద్రోయఁజెల్లునే
తీరగునే! మదిన్గనుమ, ధీరవిచార; మనోజధర్మముల్.

కాళిదా:— యువతీ! నీ మార్గంబు ధర్మవిరుద్ధంబు. యౌవనవతివి కావున విరహాతురంబు నోపక దురితార్ణవంబునఁ బడెదవు. నీ మార్గంబనుసరింప నా మానసంబొప్పదు. వదలుము దారి.

సీ. జననంబునిచ్చిన జననివికావున
జనకుండనైనఁగ వనితనీకు

మదా:— జననమిచ్చిన లోకజనని నీ జననియౌ;
యనుఁగుదారకు నీవు తనయుఁ డెటుల

కాళి:— తనయుఁడునగుదువి, ద్యాదాతకును నేను
దానమిచ్చిన దాసనై ననీకు

మదా:— దానమిచ్చినది భవాని, నే వేఁడినదాన
నీ వెఱుఁగ నేదయిత నేను.

కాళి:— గీ॥ మనము, ధర్మంబుతప్పదు, మగువవినవె
మదా:— కనుము, దయననుదారను గనలవలదు
కాళి:— చనునె యీ హీనవాక్కులు జననినీకు?
మదా:— ప్రాణదానమ్ము నిమ్మరొ ప్రాణనాథ.

కాళిదా:—మానినితో నేమాటలాడుచు నిలిచినచో మానస మేమగునో?

శ్లో॥ వినాయంత్రేణ మంత్రేణ, తంత్రేణ వినయేనచ।
వంచనంతి నరంనార్య, ప్రజ్ఞా ధనహుపిత్తణాత్ ॥

కావున నిట నుండఁజనదు. శైళమ్మే వెడలెద.

( కాళిదాసు వెడలిపోవును )

మదనసే:— హా హా ఖావిధి యిటులరయ్యెను. ఎవరిని దూఱుదును. ఎవరికె మొఱలిడుదును. రాజాధిరాజున కేకపుత్రికనై పతినిఁ బాసి రయేకాకినై తిని. పతివియోగదుఃఖంబు నే నెటుభరింతు ఎటుసైరింతు. పతివదలెనని వినినచో నగరివారు నన్నుఁగని నగరా? సరివారిలో నే నెటు మొగమెత్తికొని నడతును. అయ్యో దైవమా! నే నన్నివిషయముల మందభాగ్యను. కడు బీదలింట ననుబుట్టింపక రాజన్యునింట దైవ మేల పుట్టించెనో? పుట్టించెనుబో, సామాన్య స్త్రీలబలె నన్నుంపక, సకల కళాకోవిదను జేయ నా తండ్రి యేల యత్నించెనో? యత్నించెనుబో, విద్యాగురువు నన్నుఁ దనయగా భావింపక కామాతురుఁడై ననుఁగోరి యేల తిరస్కరింపఁబడెనో? తిరస్కరింపఁబడెనుబో, యా గురువేల చలపాదితనమున గాడిదలు గాదు దంబరవానిని మోసవిధమున నాకు వరునిగ నేర్పఱచెనో? ఏర్పఱచెనుబో, యట్టి నా భర్త దేవీవరమంది వివిధ శాస్త్రంబులు కరతలామలకములై తనయందుద్భవింప తన దారనైన నన్నుఁ దృణీకరించి, వియోగతాపంబునఁ ద్రోసి విరహాగ్నినిఁగూల్చి యేలపోయెనో? అట్టి నవమన్మథుఁడు విద్యాశాలి నన్ను విడనాడిపోయినను, ఋడమిని నే నే మని ప్రాణములతో నిలిచితినో దైవమా తెలియకున్నది.

సీ. భూపాలకునికూర్మి పుత్త్రినై జన్మించి
యిడుమలపాలయ్యెఁ బుడమిబ్రదుకు

సౌందర్యవతియని యందఱాడఁగవిని,
చెందితిగర్వంబు, చెడితిఁదుదకు
సకలకళావతి యకళంకమతియను
విఖ్యాతినితయయి వెతలఁబడితి
తర్కించిరాజన్య తనయుల నోడించి
డంబరవానికి దారనైతి

గీ. దేవివరమంది భర్తనుదివ్యశాస్త్ర
పండితునొనర్చి యపమతిఁబడితినిపుడు
అయ్యొ వంతలఁ గుందంగనయ్యెనేఁడు
మందభాగ్యలకబ్బునేమహినిముదము.

[ఉపాధ్యాయుని ప్రవేశము]

ఉపా:— మదనసేనా! నీగురువుల మహిమయిపుడైనను గంటివియా? నీవబలవు! అనాథవు: ఇపుడు నిన్నుబలవంతముగఁబట్టికూడెద. ఏమిసేయుదువో చూచెద.

మదన:— ఓరీ! నీవుదుర్మార్గుఁడవు గురువుకాదు: నాతండ్రినుండి నీకుఁగలుగుచుండిన యుపత్రాడు తప్పించిన దురితము నాకువాటిల్లినది. నేనబలననియునవాథననియు నీవుకూసితివి. నీవుబకువవలె బలిసిపోగుతెక్కిన రొమ్మునెత్తికొనివచ్చినమాత్రాన నీకునేవెఱతునా? ఏదీనమీపమునకురమ్ము నీ శిరంబుఁదెగవ్రేసెద.

[అనుచుబాకుదీయును]

ఉపా:— [దూరమునకుఁబోయి] ఓహో. ఇదికృపాణధారిణియైవచ్చినది? దీనిసమీపమునకుఁబోఁజనదు. ఊపిరియుండినను పైనఁబడిని బ్రదుకవచ్చును. [అనుచుఁబరుగిడును.]

మదన:— ఈ బ్రదుకునేబ్రదుకఁజాల సౌందర్యవతినిఁజూచిన మగవారికందఱికినిఁగంటిలో నివ్వుపడును. అందునఁబతిహీనను జూచినపురుషునకుఁదరుణి తృణప్రాయగ నగపడుచుండును. నాజన్మంబువ్యర్థంబు అంబాభవానికిమ్రొక్కి నాకరవారంబుననేనాశిరంబు దెగఁగిగొనియెద.

సీ. పతిబాయుసతిగతి ప్రాణముతోనున్న
శవముఁబోలదెభూపిశాచిరీతిఁ
బతిబాయు, సతితనూ పాదపమెత్తఱి,
నిష్ఫలపత్రమైనిలుచుఁగాదె?
పతిరక్షలేదేనిఁ బరభూతభీతియే,
సతికినెత్తఱినైన సంఘటిలదె?
పతిలేనిసతితనూ భాగ్యంబు హరియింప
విటచోరులుండరే వేఁచియెచట?

పతినిఁబాసినసతి క్షితిఁబ్రదుకనేల
పతిని, బాసినసతికి, దుర్గతినిజమ్ము
పతియు, ప్రాణమ్ము దైవమ్ము సతికినెచట
గాన, మననేలనేనిలఁగాయమ్మునను.

[కరవాలమెత్తును]

(వీరయోగిప్రవేశము)

శ్లో. మాయాకుండలి నీక్రియామధు మధూకాళీ, కళామాలినీ
మాతంగీ విజయాజయా భగవతీగౌరీ శివాశాంభవీ
శక్తిశ్శంకర వల్లభాత్రినయనా వాగ్వాదినీ భైరవీ
హ్రీంకారీ త్రిపురే పరాపరమయీ మాతా కుమారీత్యసి.

( దేవీలఘుస్తోత్రము లోనిది. )

వీరయో:— మదనసేనా! నీవిటుల ప్రాణహానికి లోఁబడవలదు. నీవువిరహతాపంబునఁ గుందవలెనను శాపవశమునసీకిట్టిదశ ప్రాప్తిల్లినది. నీవుపురుషవేషంబును ధరించిధారానగరంబుఁ జేరుము. అచటవిద్యాసర్వస్వ మేదినియనునామమునంది, వేశ్యవై, విద్యయందు నిన్నుగెలిచిన వానికి దాసినగుదునని ప్రకటింపుము. భోజరాజుయొక్క యాస్థానమందున్న పండితులందఱు, నీ దాసీ జనుల వలననోడుదురు. మదనసీపతికాళిదాసు నిన్నోడించి నినుఁగూడును. అచట దేవతావార వధూటులనేకులు, శాపవశలై, నీదాసీలుగ నేర్పడియుందురు. వారనేకవిద్యలు వచరించి, కాళిదాసుఁదప్పమఱి యేపురుషుఁడును నిన్నుసమీపింపనటులఁ జేయుదురు. ఇదిదేవతావచనము. నమ్ముము. [అదృశ్యుఁడగును]

మదన:— ఈమహానుభావుఁడెవడుండును? ఇటకేలవచ్చియుండును? ఇతనివచనమ్ములన్నియుఁ దథ్యములని నాయంతరాత్మతెలుపుచున్నది. అయ్యో; రాజన్యకన్యనై వారవధూటికావలసివచ్చెనే? కానిమ్ము నాపతినిఁబడయుటకు నేనెన్ని వేషంబులనైన వేసెద. మార్గమ్మునందేదుర్మార్గులు నన్ను బాధింపనటుల పురుషవేషంబును ధరించిధారానగరంబుఁజేరెద. ఆలోకజనని నాయత్నము ఫలింపఁజేయునని ప్రార్థించెద.

" సుందరహిమకరవదనాం కుందసురదనాం ముకుందనిధి సదనాం॥
" కరుణోజ్జీవిత మదనాం సురకుశలా మాసురేషుకృతి కదనాం॥
" శరణాగత జనభరణాం కరుణావరుణాలయాంశి వావరణాం॥
" మణిమయ దివ్యాభరణాం చరణాంభోజాత సేవకోద్ధరణాం॥
" తుంగస్తన జితకుంభాం కృతపరిరంభాంశి వేనగుహడింభాం॥
" దారితశుంభని శుంభాం. నర్తితరంభాంపురో విగతదంభాం॥
" నతజనరక్షాదీక్షాం దక్షాంప్రత్యక్ష దైవతాధ్యక్షాం॥
" వాహీకృతహర్యక్షాం క్షపితవిపక్షాం సురేషుకృతరక్షాం॥
" ధన్యాంసుర వరమాన్యాం హిమగిరికన్యాం త్రిలోకమూర్ధన్యాం
" విహృతసురద్రుమ వన్యాం వేద్మివినాత్వాం నదేవతామన్యాం॥

( అనుచుభవానికి నమస్కరించి, నిష్క్రమించును )



# కాళిదాసనాటకము.

## తృతీయాంకము - ప్రథమరంగము.

ధారానగరరాజవీధి.

కాళిదాసు - దర్పసారుఁడు - వీధిలో జనులు - కాంచనమాల.

దర్పసా:—(చేతిలో కొరడాపట్టుకొని జనులనుగొట్టుచు కాంచనమాలను దఱుముకొనివచ్చును.)

కాంచన:—హా. హా. ఈదుర్మార్గుఁడు దర్పసారుఁడు బలాత్కారముగ నన్నుఁ బరిభవింప యత్నించు చున్నవాఁడు ఈవీధియందు నన్నుఁగాపాడువారెవరును లేరే?

జనులలోనొకఁ.—అబ్బా! వాఁడురాజు పెండ్లాము తమ్ముఁడు వానినెదిరించినఁజంపునే.

కాళిదా:-(దర్పసారునిఁజూచి) ఓరీ! దురాత్మా! అబలలపైనింతటి దుడుకుతనంబుచెల్లునే దూరమ్మున నిలుపుము.

దర్ప:— ఓరీ; నన్నుదిరస్కరించి మాటలాడెదవా? నాభుజబలవిభవంబున నిన్నుఁ. నేలఁద్రొక్కెద.

కాళిదా:—ఓరీ. ఈ దురాగతంబునకుఁ గారణంబు నీభుజబలవిభవము గాదు. నీయక్కగారియంగ బలవిభవము.

" చతురంతురగంపరివర్తయతః పథిపౌరజనాన్పరి మర్దయతః
" నహితేభుజవీర్యభవో విభవో, భగినతనుభాగ్యభవో విభవః॥

(జనులందఱును జప్పట్లుకొట్టినవ్వుదురు.)

దర్పసా:—(దూరమునఁబోయి) స్వగతము. వీఁడెవఁడో గొప్పకవిగనున్నవాఁడు. ఇందఱిజనులలో వీనికేమయినను నేసినినేనివాబావ భోజునకుఁ దెలిసిన నన్ను దండించును. అదికార్యముగాదు. (ప్రకాశముగ) (ఓరీ! కరాళాయని యఱచును)

కరాళ:—స్వామీ వచ్చితిని.

దర్పసా:—(మెత్తగ) ఓరీ! ఆ పొగరుపోతునెటులయినను మనదేవాలయమును జేర్పుము. అచ్చటి బహ్మరాక్షసునిచే వీఁడుచంపఁబడును.

కరాళు:— చిత్తము.

(నిష్క్రమము - దర్పసార - కరాళుఁడు - జనులు.)

కాళిదా:—(కాంచనమాలనుఁజూచి) కాత్వంబాలే.

కాంచన:—కాంచనమాలా.

కాళి:— హా. హా. దీనియంగరుచి కాంచనమాలయను. అన్వర్థనామంబువహించినది. విద్యావంతురా లుగనగపడెడు. కస్యాః పుత్రీ?

కాంచన:—కంచుకవత్యాః.

కాళిదా:— హా హా. వేశ్యపుత్రియఁట. నాకు చాల ననుకూలమయ్యెను. దైవఘటన యిటులుండవలదా? “ కింతేహస్తే ”

కాంచన:—“ తాళీపత్రం ”

కాళిదా:—“ కావారేఖా ”

కాంచన:—“ కా ఖా గా ఘా ”

కాళిదా:— ఈ ముగ్ధయొక్క ప్రత్యుక్తి యతి రమణీయముగనున్నది. కాంచనమాలా! నీవు త్వరలో నింటికిఁబొమ్ము.

కాంచన:— మహానుభావా! నా మానరక్షణమొనర్చిన మీరు నా గృహమునలంకరింపఁజేసి నే నొనర్చు సత్కారంబు లందుదురని ప్రార్థించెద.

కాళిదా:— ( స్వగ ) నాకును, నిదియు కావలెను. పరదేశమిది. కాంచనమాలా! నీ ప్రార్థన నంగీకరించి నీ వెనువెంటవచ్చెద. (స్వగ) ఈ సుందరినిఁ జూచినక్షణమున నేను మానివశుఁడ నైతిని.

కుంకుమపంక కళంకిత దేహా
గౌరపయోధర కంపితహారా
నూపురహంస రణత్పదపద్మా
కం నవశీకురు తే భువిరామా.

( నిష్క్రమణము. )

## ద్వితీయరంగము.

## దేవాలయము.

కాళిదాసు - కాంచనమాల - బ్రహ్మారాక్షసి.

కాంచన:—కాళిదాస మహాకవీ! ఆ దర్పసారుని యౌద్ధత్యమును జూచితివియా; మనము గృహముఁ జేరకమున్నే తనభటులతో మముఁబట్టించి యీ దేవాలయములోఁ ద్రోసెను.

కాళిదా:—కాంచనమాలా! ఆ దర్పసారుఁ డిప్పని నొనరించుటచే స్తుత్యుఁడయ్యెను. నింద్యుఁడెన్నటి కిని కాడు.

కాంచన:—కవీ! స్తుత్యుఁడని యీ దుర్మార్గునిఁ బిలుచుటకుఁ గారణంబేమి?

కాళిదా:—ముద్దులాఁడీ! వాఁడివ్విధంబున నిజనప్రదేశములో వదలి మనమిరువురినిఁ బ్రేమానుబంధంబున బంధింపఁజేసినవాఁడు మాకుఁ బరమాప్తుఁడగునుకదా?

కాంచన:--కళానిధీ! వానిభావంబది కాదు. రాజుగారీ దేవభవనంబుఁ గట్టించిన దినమునుండియు నొక బ్రహ్మరాక్షసి యిటఁజేరి రాత్రి యిచట నెవరుందురో వారిని భక్షించును. కావున నీ స్థలమునందు నిశీథిని నెవరును బరుండరు.

కాళిదా:--అటులయిన నా దర్పసారుఁడు మదకమాత్ర ముపకృతి నొనర్చినవాఁడు కాఁడు. లోకమునకే యుపకార మొనర్చినవాఁడగును.

కాంచన:--అదియెటులు?

కాళిదా:--ఈ దేవభవనము నిష్కంటక మొనర్చుటచే.

కాంచన:--అంతటిపని తమవలననగునా?

కాళిదా:--అగునో కాదో బ్రహ్మరాక్షసుఁడు సమీపించినపుడు నీవే కందువు.

( ఘుడిఘుడాయించుచు బ్రహ్మరాక్షసి వచ్చును. దానింగని కాంచనమాల కాళిదాసును బిగువుగఁ గౌఁగిలించును. )

కాళిదా:-- హా దర్పసారా! నీవే స్మరణీయుఁడు. స్తుత్యుఁడు.

గీ. భావభవునితాప భరమునఁ గుందెడు
యౌవనాంగి సరస నధికకృపను
యౌవనాంగిఁ జేర్చి యాలింగనసుఖంబుఁ
గలుగఁ జేసినట్టి ఘనుఁడ వీవు.

(బ్రహ్మరాక్షసి పైఁ బడ వచ్చును. )

కాళిదా:--ఓరీ! నీ వెవఁడవు?

బ్రహ్మరా:--నేను బ్రహ్మరాక్షసుఁడను. నేనిచ్చు సమస్యలకు బదులీడఁజాలని యనేకులను నేమ్రింగితిని. నేఁడు నా యాహారంబునకు నీవు దొరకితివి. నా సమస్యలు పూర్తిచేయనోపవేని మీ యిరువురిని దిగమ్రింగెద.

కాంచన:--మోహనాంగా! నన్ను రక్షింపుము.

కాళిదా:-- వారిజలోచనా! నిన్ను రక్షించెద వెఱవకుము. (రాక్షసునిఁ జూచి ) ఓరీ! నీ సమస్య లెవ్వి? ఇమ్ము. కాలహరణ మేల?

బ్రహ్మ:-- నాసమస్యలు పూర్తిచేయుదువా: అటులయిన నిదిగో మొదటి "సమస్య" "సర్వస్యద్వే"

కాళిదా:-- " సుమతి కుమతీ సంపదాపత్తిహేతూ "
ఓరీ! రాక్షసా! నీ సమస్య పూర్తి యయినదియా?

బ్రహ్మరా:--అయినది. మఱలవచ్చెద.

కాళిదా:--(కాంచనమాలనుఁ జూచి ) మోహనాంగీ! వీఁడెవఁడో వ్యాకరణముఁ జక్కఁగఁ జదువుకొనినవిద్వాంసుఁడుగ నగపడెడు. వాఁడిచ్చినది " పాణిని వ్యాకరణములోనిది " కొన్ని యర్థములందు శబ్దములకు ద్విరుక్తి కలుగునని సూత్రము. దానికి లౌకికార్థమును గల్పించి సమ

స్త్రీలయందును మంచిబుద్ధియుఁ జెడుబుద్ధియు నను రెండుబుద్ధు లుండుననియు, సంపదలకును నాపదలకును నవియే కారణములని నేఁ దెలిపితిని.

కాంచన:-- మోహనాంగా! వాఁడు మఱల నెట్టి విషమ సమస్య యిచ్చునో?

కాళిదా:--ఎట్టిదయినను నియ్యని భయమేమి వారెవ్వరు?

బ్రహ్మరా:--( ఎదుట నిలిచి ) ఓరీ! ఈ సమస్యను పూర్తిఁజేయుము. " వృద్ధో యూనా"

కాళిదా:-- " సహపరిచయా త్త్యజ్యతే కామినీభిః "

బ్రహ్మరా:--ఓరిపండితుఁడా! ఇంతలోనే మూడవసమస్య వెదకి తెచ్చెద. ( వెళ్లును )

కాంచన:--ఇదియేమి సమస్య? నీవు దానినెటుల పూర్ణీకరించితివి?

కాళిదా:--మోహనాంగీ! వాఁడిచ్చిన యీ సమస్యయున్ను పాణిని సూత్రములోనిదేను. నేనందులకుఁ జేసిన లౌకికార్థమేమనిన:--"యౌవనవంతుని తో సుఖమనుభవించిన యువతిచే ముసలిపతి పరిత్యజింపఁబడునని " నేనర్థముచేసి తెలిపితిని.

కాంచన:--ప్రాణేశా! చక్కఁగఁబలికితివి. నీవు జారుఁడవని తోఁచుచున్నది.

కాళిదా:--ముద్దులాడీ! అటులనకు. శాస్త్రజన్యజ్ఞానమిది.

( బ్రహ్మరాక్షసుఁడువచ్చి )

బ్రహ్మరా:--పండితవర్యా! " స్త్రీపుంవచ్చ " యనునది మూడవసమస్య.

కాళిదా:--" స్త్రీపుంవచ్చ ప్రభవతి యదాతద్ధి గేహం వినష్టం "

బ్రహ్మరా:--కవీ! నాల్గవసమస్య యిప్పుడే తెచ్చెద.

( వెళ్లును )

కాంచన:--మోహనాంగా! ఈ సమస్య యేమి. దానిని నీ వెటు సమర్థించితివి?

కాళిదా:--మోహనాంగీ! ఇదియు పాణిని సూత్రములోనిదేను. స్త్రీలింగ శబ్దములు కొన్ని పుల్లింగముల వలె నుండునని సూత్రము. దానిని నేను పూర్తిగ నొనరించినది యెటులనిన:-ఏ గృహములో స్త్రీ పురుషునిబలెఁ గార్యకర్తగనుండునో యా గృహము నష్టమయిపోవునని యన్వయించితిని.

కాంచన:--ప్రాణనాథా! స్త్రీ లంతటి యవివేకులా?

కాళిదా:--కాదు కాదు. ఒక్కొకవేళ వారికి దూరాలోచన యుండదు?

( బ్రహ్మరాక్షసుఁడు వచ్చి )

బ్రహ్మరా:--పండితకవీ! " ఏకోగోత్రే "

కాళిదా:--"ఏకోగోత్రే ప్రభవతిపుమాన్ యః కుటుంబంభిభర్తి."

బ్రహ్మరా:--( కాళిదాసునకు నమస్కరించి ) మహాకవీ! ఇప్పుడే తమ సన్నిధానమునకు వచ్చెద. ( వెళ్లును)

కాళిదా:--కాంచనమాలా! ఇదియును పాణిని సూత్రమేను. నేను పూర్తిచేసిన విధమేమనిన కులము

సందుష్ఫువించిన వారిలో నొక్కఁడుమాత్రము కులము నుద్ధరించును. మోహనాంగీ! ఇవి విషయసమస్యలు. సామాన్య లిట్టివానిని లౌకికార్థమున సమర్థీకరింపఁ జాలరు.

కాంచన:—మోహనాంగా! ఈ దేశమునేలు భోజరాజు స్వతః విద్వాంసుఁడు. అనేకవిద్వాంసులు వారి కొలువు నలంకరించి యక్షరలక్షలు పొందుచున్నారు. తామును వారియాస్థానమునఁ గవిశిరోమణులయి యుండఁగూడదా?

కాళిదా:—ప్రేయసీ! ఒకకవినిఁజూచిన మఱియొకకవి యుదరమునఁ జిచ్చు పడును. అందున నాస్థానమునందుండి రాజమన్నన లందుచున్న కవు లసూయాపరులు. కావున నేను నా మహిమఁ జూపుటకునై యనేకవిధములగు వేషములుపూని నా మహిమ స్థాపించి పిదప పరకపినై భోజరాజు సరసనుండెద.

కాంచన:—మోహనాంగా! అటులనే యొనరింపుఁడు.

( బ్రాహ్మణుఁడువచ్చి నమస్కరించి )

బ్రాహ్మ:—మహాకవీ! కాళిదాసా! నేను బ్రాహ్మణకవిని. వికటకవిగనుండి విషమ సమస్యలనిచ్చి యనేక కవుల నవమానపఱచి నందున నొక మంత్రవేత్త నన్ను బ్రహ్మరక్షస్సుగమ్మని శపించెను. నే వేఁడికొన్నందున నీ సమస్యలు కాళిదాసుఁడను వరకవి పూర్ణీకరించును. అపుడు నీకు శాపావధికలుగునని వాక్రుచ్చెను. నేటికి నీ దర్శనంబయ్యె. ధన్యుఁడైతిని. బ్రహ్మరాక్షసుఁడనై యనేక బ్రాహ్మణవధ యొనర్చి బ్రహ్మహత్యా పాపంబుఁ గట్టికొన్నాను. తన్నివారణంబునకునై భాగీరథిలో స్నానమొనర్చి మఱలవచ్చి తమశిష్యుఁడనయ్యెద. సెలవు ప్రార్థించెద.

కాళిదా:—బ్రాహ్మణోత్తమా! పోయిరమ్ము. విద్వాంసుఁడనని గర్వించి పరుల నెప్పుడేగాని యవమానింపకు.

( బ్రాహ్మణుఁడు వెళ్లి పోవును. )

కాళిదా:— కాంచనమాలా! చీకటియుండఁగనే నీవు నీయిల్లుఁ జేరికొనుము. లేదేని దర్పసారునుండి నీకు బాధకలుగును.

కాంచన:—మహానుభావా! నిన్నువదలి నేనుండఁజాలను. నేను వేశ్యనైనను నీవే నా ప్రాణపతివని నమ్మినాను కావున మీరు నా వెంటవచ్చి నా గృహము పవిత్రమొనర్తురని వేఁడెద.

కాళిదా:—నినుఁబోలు సౌందర్యవతి గుణవతి వేఁడుచుండ నిరాకరించుట మానవసాధ్యమా; వచ్చెదను రమ్ము. ఇదియా మకరధ్వజుని మహిమ.

" శంభు, స్వయంభు, హరయో, హరిణేక్షణానాం ।
యేనాక్రియంత సతతం గృహకుంభదాసాః ॥

వాచామగోచర చరిత్ర విచిత్రితాయ ।
తస్మైనమో భగవతే మకరధ్వజాయ॥"

[ నిష్క్రమము. ]

## తృతీయరంగము.

భోజరాజు కొలువుకూటము. భోజుఁడు భవభూతి
దండి - మొదలగుకవులు - సన్యాసి - భటులు.

భోజ:— పండితాగ్రేసరులారా! నాచేఁగట్టింపఁ బడినదేవాలయమిపుడు పెల్లుదినములుగనిష్కంటక మైనదఁట. అచటనున్న బ్రహ్మరాక్షసుఁడెచటికో వెళ్లిపోయెఁట. మనదర్పసారుని నొక చమత్కారశ్లోకమున ధిక్కరించినకారణంబున దర్పసారుఁడు కాంచనమాలతో నైతము రాత్రి యాకవిని దేవాలయములోఁ ద్రోసెనఁట. బ్రహ్మరాక్షసునకును వాకవికిని రాత్రి కవిత్వవిచారములోఁ జర్చజరిగె నఁట. బ్రహ్మరాక్షసుఁడోడిపోయెనఁట. ఆకవివరుఁడెవఁడో తెలియకున్నది. ఆకవి,కాంచనమాలను నింటిలో వదలి యెచటికో వెళ్లిపోయెనఁట. ఎంత వెదకినను దొరకఁడు.

భవభూ:—మహాప్రభూ! వాఁడేమో స్మశానములోఁ గూర్చుని, భూతోచ్చాటన మంత్రసిద్ధిఁగాంచి యుండును. నిజముగఁగవిగనుండునేని, సభకువచ్చిమాతోఁ దర్కించుటకు జంకనేల?

దండి:— నిజము. నిజము. కొందఱు గుచ్ఛకవులు తెలియని వారివద్దకుంబోయి, యచటనచట దొంగ లించినకొన్ని పద్యములుచెప్పి, మూర్ఖులను మెప్పింతురు. నిజముగపండితులసభకురా జాలరు. అట్టివారిలో వీఁడొకఁడుండును.

[భటులొకసన్యాసిని నీడ్చికొని వత్తురు. హరివాసరమైనను సన్న్యాసి తాంబూలమునమలుచు మద్యపానమొనర్చినవానింబలె నటించుచుఁజేతిలో మాంసముంచికొని యుండును.]

భటుఁడు:—తమయానతిరీతిని మేముహరివాసరమును రక్షించువారము. మేము తత్కార్యనిర్వాహక మునకునై వీథివీథి సంచరించుచుండ, నీబ్రాహ్మణ సన్న్యాసి మద్యపానమొనర్చి చేతిలో మాంసముంచుకొని తాంబూలము నములుచు వికారపడుచుండెను. పట్టితెచ్చితిమి.

భోజ:— (సన్న్యాసినిఁజూచి) భిక్షో మాంసనిషేవణంకిముచితం?

సన్న్యాసి:—" కింతేనమద్యంవినా ".

భోజ.— ఏమిది. మాంసము సేవింపవసునాయని నేను ప్రశ్నించినందులకు మద్యములేక యది రుచింపదనిబదులిడెను. " మద్యంచాపితవప్రియం, "

సన్న్యా.—ప్రియమహోవారాంగవాభిస్సహ

[అందఱునవ్వుదురు]

భోజ.— ఈసన్న్యాసికివారాంగనలతోఁగలసిమద్యమును సేవించుట ప్రియమగును. ఔరా! ఎంతటి జొప్పఁబిది.

"వార స్త్రీరతయే కుతప్త వధనం"

సన్యాసి.—ద్యూతేన చౌర్యేణవా

[నవ్వుదురు.]

భోజ.— చౌర్యద్యూతపరిజ్ఞతా స్థివతః.

సన్న్యాసి.—భ్రష్టశ్య కావాగతిః.

[భోజరాజుతో సైత మందఱునవ్వుదురు.]

భోజ.— ఓరీ! సన్న్యాసీ! ఇట్టివృత్తి నా రాజ్యమునఁ జెల్లదు. ఇప్రదునిన్ను మన్నించితిని. ఇఁక ముందీనడత వదలుము పొమ్ము.

[సన్న్యాసి వెళ్లిపోవును.]

పండితవరులారా! చూచితిరా! యీ సన్న్యాసి వాక్చాతుర్యము కవితాచమత్కృతి. ఇతఁడేయుండునా. బ్రహ్మరాక్షసునితో వాదించి యోడించినవాఁడు?

భవభూతి.—వీఁడెవఁడో బ్రాహ్మణపతితుఁడు. ఉన్మాదము తలకెక్కి ప్రేలుచున్నవాఁడు.

దండి:— పిచ్చియెత్తినవారికిఁ గవిత్వము ధారాళముగ వెళ్లుచుండును.

భోజ.— బ్రహ్మరాక్షసునితో వాదించిన కవిని గాంచి సత్కరింప వలెననుకుతూహలము నాకు హెచ్చుగనున్నది. వాఁడెచటనున్నవాఁడో యిఁకను వెదకించెద. మనమిప్రదు కొలువు ముగింతము.

[నిష్క్రమము.]

## చతుర్థరంగము - ఆస్థానము.

భోజరాజు - భవభూతి - దండిబాణకల్హాణ బిల్హణ మల్హణాదులు

శాస్త్రి - కుబేరుఁడు-స్తంభకారుఁడు-నిర్భాగ్యశాస్త్రి.

భోజరా.—మహాకవులారా! నేఁడసుదినంబు. ఇందఱు మీరిచటఁగూడితిరి. నేధన్యుఁడనైతిని. [గోడనుఁజూచి] "అపదర్థంధనంరక్షేత్" యని వ్రాసినవారెవరు?

కుబేరుఁ.—మహాప్రభూ! నేనే వ్రాసితిని. భాండాగారములోని ధనముదినదినము సన్నగిల్లుచున్నయది. తమకు స్వయముగఁ దెలుపఁజాలక యటు వ్రాసితిని.

భోజ.— [నవ్వుచు] "శ్రీమతా మాపదఃకుతః" భవభూతీ! శ్రీమంతునకు నాపదయెచటినుండివచ్చును

కుబేరుఁ.—"సాచేదపగతాలక్ష్మీ."

భోజరా.—వీఁడుమూర్ఖుఁడు లక్ష్మిచంచలురాలు. కావున నెప్పుడయినను వదలిపోవునని భీతిల్లినాడు? అటు లక్ష్మి వదలిపోవునప్రదు సంచితార్థోపినశ్యతి; యనియున్నదిగదా ఎంతగుప్త ముగ

ధనము దాఁచినను లక్ష్మి వదలిపోవునప్పుడు దాఁచినధనము నిలుచునా?

కుబేరుఁడు:-మహాప్రభూ! నేను మూర్ఖుఁడను. మీయంతటి ధృఢమానసము నాకు లేదయ్యెను.

( కుంభకారుఁడు ప్రవేశించి నమస్కరించి )

కుంభ:— భూమిపాలా! తమరొక కవికి గృహమిప్పింప భటునకు నాజ్ఞాపించితిరఁట. నగరములో నుండు వారందఱును గవులఁట. కావున నాయిల్లు వదలుమని బలాత్కరించుచున్నాఁడు.

భోజుఁడు:--కుంభకారా! నీవు కావ్యముఁ జెప్పఁగలవా?

కుంభ:—" కావ్యం కరోమి నహి చారుతరం కరోమి
యత్నాత్కరోమి యదిచారుతరం కరోమి
భూపాలమౌళి మణిరంజిత పాదపీఠ
హే సాహసాంక, కవయామి, వయామి, యామి."

భోజ:—కులాలకుఁడవయినను నీవు నిజముగ కవివి. కావున నీవు సుఖముగ నా పట్టణముననుండుము. నీకు నేతొందరయును గలుగదు. పొమ్ము ( కులాలక నిష్క్రమణము. )

నిర్భాగ్య:--భూమిపాలా! నేను భూరి నిర్భాగ్యుఁడను.

" రాజన్ కనకధారాభి స్త్వయి సర్వత్ర వర్షతి
" అభాగ్యచ్ఛత్ర సంఛన్నే మయి నాయాంతి బిందవః

భోజ:--కుబేరా! ఈ కవినిఁ బిలిచికొనిపోయి యీ శ్లోకమునకు నక్షర లక్ష యొసంగుము.

కుబేరుఁడు:-చిత్తము.

( భటుఁడొకఁడువచ్చి )

భటుఁడు:--మహాప్రభూ! ద్వారమునఁ గుటుంబకవులఁట నలుగురువచ్చి కాచినారు. తమముదల యయిన, వచ్చెదమనుచున్నారు.

భోజుఁడు:--రమ్మనుము. కవులు ద్వారమ్మునఁ గాచుటేల?

( భటుడుపోయి కుటుంబకవులను బిలిచికొనివచ్చును.)

రాజు:— ( నమస్కరించును. )

కవులు:— " అభ్యుదయోస్తు "

రాజు:— ( ముసలికవినిఁ జూచి ) తాతగారూ! మీ రేదేశస్థులు. భవదాగమనకారణం బేమి?

కవి:— భూమిపాలా! మాది కాశీనగరము. మా యింట నుండువార మెల్లరము కవులము. కావుననే దారిద్ర్యదేవత మమ్మంటి పీడించుచున్నది. ఈ నాకుమారుని యొక్కయు, నీ నా కొమార్తెయొక్కయు వివాహము నెఱపవలెనని తలంచి దానకర్ణుఁడు భోజుఁడని విని యిచ్చటికి వచ్చితిమి.

భోజ:— స్వామీ! తాము సమస్యలు ప్రభంజనముగఁ బూర్ణీకరింపఁ గలరా?

కవి:— భూమిపాలా! యథాశక్తి వ్యాఖ్యానముగఁ జేయఁగలము.

భోజ:— అటులయిన "క్రియాసిద్ధిస్సత్త్వే భవతి మహతాం నోపకరణే" యను సమస్యను పూర్తి కరించి శ్లోకము చదివుఁడు.

కవి:— "ఘటోజన్మస్థానం, మృగపరిజనో, భూర్జవసనః"
"వనేవాసః, కందాదికమశన, మేవం విధగుణః ॥
"అగస్త్యః పాథోధిం యదకృత కరాంభోజకుహరే
"క్రియాసిద్ధిస్సత్త్వే భవతి మహతాం నోపకరణే॥

భోజ:— మహాకవీ! ఈ చమత్కారశ్లోకమునకు నక్షర లక్షయొసఁగఁబడును, తల్లీ! ఈ శ్లోకమును నీవెటుల సమర్థీకరించెదవు?

కవిభార్య:— "రథస్యైకంచక్రం, భుజగయమితా స్సప్త తురగాః
"నిరాలంబోమార్గ శ్చరణవికల స్సారథిరపి ॥
"రవిర్యాత్యేవాంతం ప్రతిదిన మపారస్య నభసః
"క్రియాసిద్ధిస్సత్త్వే భవతిమహతాం నోపకరణే ॥

భోజరా:— ఔరా! శ్లోక సారస్యము. ( కుమారునిఁజూచి ) నీవెటుల ముగించెదవు?

కుమా:— "విజేతవ్యా లంకా చరణ తరణీయో జలనిధిః
"విపక్షః పౌలస్త్యో రణభువి సహాయాశ్చ కపయః
"పదాతిర్మర్త్యోసౌ సకలమవధీ ద్రాక్షసకులం
"క్రియాసిద్ధిస్సత్త్వే భవతిమహతాం నోపకరణే ॥

భోజరా:— ఈ శ్లోకమున్ను మనోహరముగ నున్నది. ( కుమార్తెనుఁజూచి ) బిడ్డా! ఈ సమస్యను నీవెటుల సమర్థీకరించెదవు?

కవికూఁతురు:— "ధనుః పౌష్పం మౌర్వీమధుకరమయీ చంచలదృశాం
"దృశాంకోణో బాణ స్సుహృదపి జడాత్మా హిమకరః
"స్వయం చైకోనంగ స్సకలభువనం వ్యాకులయతి
"క్రియాసిద్ధిస్సత్త్వే భవతిమహతాం నోపకరణే" ॥

భోజుఁడు:— ఔరా! ఈ శ్లోకార్థ చమత్కృతి! ( కుబేరునిఁజూచి ) కుబేరా! వీ రందఱికిని, నక్షరలక్ష లొసంగుటయే గాక యీ యంబను నీ బిడ్డను లీలావతి సరసకుఁ బిలుచుకొనిపోయి వీరిని జక్కఁగ సత్కరింపుమని తెలుపుము.

కుబేరు:— చిత్తము ( వారినిఁ బిలిచికొని పోవును )

భటుఁడు:— భూమిపాలా! ఎవఁడో యొక బ్రాహ్మణుఁడు పెద్దమత్స్య మొకదానిఁ జంపి చంకలోనిడి కొని వచ్చుచున్నాఁడు. ఆ మత్స్యమునుండి రక్తము స్రవించుచున్నది. వాఁడు లోనికి రాఁ బ్రయత్నించుచున్నాఁడు. సెలవైనఁ బిలిచికొనివచ్చెద.

భోజుఁడు:--రానిమ్ము. బ్రాహ్మణుఁడెట్టివాఁడో చూచెద.

( భటుఁడా బ్రాహ్మణుని లోపలికిఁ బిలిచికొని వచ్చును. అందఱు సభ్యులగుదురు. )

భోజరా:—బ్రాహ్మణా! ''కక్షేకింతవ?''

బ్రాహ్మ:--'' పుస్తకం ''

భోజరా:-- '' కిముదకం? ''

బ్రాహ్మ:-- ''కావ్యార్థసారోదకం.''

భోజరా:--''గంధఃకిం?''

బ్రాహ్మ:--''ఘనరామ రావణ మహాసంగ్రామరంగోద్భవః.''

భోజరా:--'' పుష్పఃకిం ?''

బ్రాహ్మ:--''నవతాళపత్రలిఖితం.''

భోజరా:--'' కిం పుస్తకం హేకవే ?''

బ్రాహ్మ:--'' రాజన్; భూమిసురోత్తమా వృతమిదం రామాయణం పుస్తకం.''

భోజరా:--( ఆశ్చర్యపడి ) ఏదీ! ఆ పుస్తకమిటు తెమ్ము.

బ్రాహ్మ:--[ తాటాకుల పుస్తకమును గ్రిందఁగొనుచును. దానిఁజూచి యందఱు నచ్చెరువందుదురు.]

బ్రాహ్మ:— '' మహారాజశ్రీమన్ జగతి యశసాతే ధవళితే
'' పయః పారావారం పరమపురుషోయం మృగయతే
'' కపర్దీకైలాసం కరివరమభౌమం, కులిశభృత్
'' కళానాథంరాహుః కమలభవనో హంస మధునా.

భోజరా:--ఇదికదా కవితాలక్షణము. కవియనిన నిటులుండవలదా?

భవభూ:—మహాప్రభూ! తమ యశోవర్ణనము, చక్కఁగ నున్నదిగాని సృష్టిస్థితిలయాధికారులకు దాము నగుణ కల్పనంబు దోషంబు.

దండి:— మీ యశస్సు జగత్తెల్లనిండి తెల్లఁగఁ జేసినదఁట. చేయనిండు జగత్సంరక్షణ కర్తయయిన పరమపురుషుఁడు విష్ణువు క్షీరసముద్రముఁ గనలేక పోరునఁట. ఇదియేమి నిందారోపణము?

బాణు:— సర్వజ్ఞుఁడగు నీశ్వరుఁడు వెండికొండఁ గనఁడాయెనఁట. ఇఁక సర్వజ్ఞుఁడని యీశ్వరునకుఁ బేరేల?

శంకరకవి:--ఇంద్రుఁడు తనవాహనమగు నైరావతమును గాంచఁడాయెనఁట. కట్టినస్థలమైనను దెలియఁడాయెనా?

మల్హణు:--బ్రహ్మ తనవాహనమగు హంసరాజమును గుర్తింపఁడాయెనఁట. అదియెగిరదా?

కల్హణు:--కళానాథుని గనలేక రాహువు నతనిని వెదకుచున్నవాఁడఁట.

ఈ కవియే, కళానాథుఁడని యితనిని మ్రింగునేమో?

బిల్హణు:—ఈ శ్లోకమునందు '' అధునా '', యను శబ్దముపయోగింపఁ బడినది. ఇప్పటికిని మ్రింగ

త్ర్యాదు లజ్జానులై యిండ్లు వాకిండ్లువదలి నిలువ నీడ లేక, రొక్కము వాహనము లేక భిక్షగాండ్రబలెఁ దిరుగుచున్నారని యర్థమగును. మహాప్రభూ! తమ యశోవ్యాప్తిచేఁ ద్రిమూర్త్యాదులకు బాధకలిగినదిగాన తమయశస్సు చాలింపవలెనని దోషార్థమిచ్చుచున్నది.

బ్రాహ్మ:—[ స్వగ ] [ వీరందఱు నసూయాపరులు. ]

భోజరా:—మహాకవీ! త్రిమూర్త్యాదులకు నా యశమునుండి కలిగిన బాధయెటుల నివారకమాయెను.

బ్రాహ్మ:— " నీరక్షీరేగృహీత్వా నిఖిలఖగతతీర్యాతి నాళీకజన్మా
" తక్రంధృత్వాతుసర్వా, నటతి జలనిధిశ్ చక్రపాణి ర్ముకుందః॥
" సర్వానుత్తుంగ శైలాన్ దహతిపశుపతిః ఫాలనేత్రేణ పశ్యన్,
" వ్యాప్తా త్వత్కీర్తికాంతా త్రిజగతి నృపతే భోజరాజక్షితీంద్ర."

భోజరా:—ఇదికదా కవిచమత్కృతి. కవియన నితఁడే.

భవభూ:—మహాప్రభూ! తమయశోధవళిమముచే జగమంతయు నిండియుండ నీరమిది క్షీరమిదియను భేదమెటులగపడును. ఇదియసంగతము. తక్రమిదియని యెటు తెలియును. ఇదియు నసమ్మతము.

భోజరా:—పండితులారా! స్తుతిపాఠము నందిట్టివి, కవులకు స్వాతంత్ర్యవిషయములు. కావున నాక్షేపణార్హములు కావు.

బ్రాహ్మ:—" సుకవేశ్శబ్ద సౌభాగ్యం సత్కవిర్వేత్తి నాపరః ।
" వంధ్యా నహి విజానాతి, పరం దౌహృద సంపదం॥

భవ:— [ కోపమునలేచి ] ఏమీ! బ్రాహ్మణా! మేము సుకవులము కామా; మాకు శబ్దసౌభాగ్యము తెలియదా?

దండి:— రాజుమెచ్చెనని వీఁడేమో గర్వించి మాటలాడెడు.

శంక:— మేము వంధ్యాసమానులమఁట. సుశబ్దదౌహృద సంపద మాకులేదఁట. ఔరా! వీనిగర్వము.

భోజరా:—పండితవరులారా! మీరీవిధిని నాగ్రహపడకుఁడి. మీకుఁ గొన్నిసమస్యలిచ్చెద. ఎవరు రసవంతముగ దానినిఁ బూర్తీకరింతురో చూచెద.

పండితు:—మంచిది.

భోజరా:—" చరమగిరినితంబే చంద్రబింబం లలంబే " ఈ సమస్యకు భవభూతీ నీవొకచరణంబుఁ జేయుము.

భవభూ:—" అరుణకిరణ జాలై రంతరిక్షేగతర్క్షే"

భోజరా:—దండీ! నీవేమి పలికెదవు.

దండి:— " చలతిశిశిరవాతే మందమందం ప్రభాతే "

భోజరా:—బ్రాహ్మణోత్తమా! నీవేమనియెదవు.

బ్రాహ్మ:—" యువతిజనకదంబే నాథముక్తోష్ఠబింబే "

భోజరా:—[ బ్రాహ్మణుని సమీపించి వందనమొనర్చి ] ఇదికదా రసికవరుఁడగు కవియొక్క సరస రచనా చమత్కృతి.

[ దండి భవభూతులు కోపము నభినయించుచు. ]

భవభూ:—భూపాలా! నేడీ బ్రాహ్మణునిపై నీకుఁగలిగిన యనురాగమున మీరు వానిసెక్కించి మమ్మవ దించుచున్నారు.

భోజరా:—పండితవరులారా! అటుకాదు. ఈకవి వాక్కునుండి వచ్చిన ప్రతిశబ్దము లేనలో నాన వేసితీసిన రీతిగ నుండును.

[ మంత్రము లుచ్చరించుచు సుబ్బావధానులు బ్రహ్మావధానులను బ్రాహ్మణులు ప్రవేశింతురు. ]

భోజరా:-- [ వారికి నమస్కరించి ] తామువచ్చిన కారణంబేమి?

సుబ్బావ:--భూమిపాలా! సర్వవేదవిదులము. మావిద్య నడుగువారు లేరు. మావిద్యకిప్రుడు కూడుగలు గదు. మేమిరువురముగూడి మూఁడునెలలు కష్టపడి యొకశ్లోకమును రచించినాము.

భోజరా:--స్వామీ! అదియేమి శ్లోకమో పఠింపుఁడి.

సుబ్బా:—ఓరీ బ్రహ్మ! ప్రారంభము మఱచిపోయెను. నీకేమయిన జ్ఞప్తిలోనున్నదియా?

బ్రహ్మ:— నాకు రెండవచరణమువచ్చినది. మొదటిచరణమేమో?

సుబ్బా:—వచ్చిన రెండవచరణమైనను చెప్పరా?

బ్రహ్మ:— " యజ్ఞోపవీతం పరమం పవిత్రం "

సుబ్బా:—నాకును మొదటిచరణము జ్ఞప్తికివచ్చెను.

" అణోరణీయాన్ మహతో మహీయాన్ "

భోజరా:—స్వామీ! రెండుచరణంబులయ్యెను. మిగత రెండుచరణము లెవ్వి?

సుబ్బా.—మహాప్రభూ! నాలుగుచరణములు పశువులకు. మనుష్యులవలె రెండుచరణములే శ్లోకమున కని మేము తలంచియుంటిమి.

భోజరా.—వీరు కేవల ఛాందసులు. ఈ రెండుచరణములే సమస్యగ నీ పండితవరులకు నిచ్చెద.

పండితవరులారా! " అణోరణీయాన్ మహతో మహీయాన్ |

" యజ్ఞోపవీతం పరమం పవిత్రం ॥

దీనిని సమంజసార్థయుక్తముగఁ గుదిర్చి శ్లోకమునుఁ జెప్పుడి. భవభూతిగారూ! మీరు ప్రారంభింపుఁడి.

భవభూతి.--భూపాలా! పిచ్చిఛాందసుల కూఁతలు శ్లోకమెటులగును?

దండి.— భవభూతి తాత్పర్యంబున నే నేకీభవింతును.

బాణ.— నిజము నిజము.

భోజరా.—బ్రాహ్మణోత్తమా! తామేమనిరెదరు?

బ్రాహ్మ:—భోజనృపతీ, పలికెదనువినుము

అణోరణీయాన్ మహతో మహీయా
న్మధ్యం నితంబశ్చ యదంగనాయాః
తదంగహారిద్ర నిమజ్జనేన
యజ్ఞోపవీతం పరమం పవిత్రం॥

భోజరా:—[బ్రాహ్మణుని నాలింగనమొనర్చి] యండి భవభూతులారా! ఇప్పుడేమనియెదరు? ఇతఁడు మహాకవిగాఁడా?

భ॥నంది:—భూమిపాలా! మహాకవియని సమ్మతింపఁ దగినదియే.

భోజరా:—మహాకవీ! ఏ శుభాక్షరములు మీ నామాంకితములయి వెలయుచున్నయవి.

బ్రాహ్మ:—భోజరాజు హస్తములో నక్షరములు వ్రాయును.

భోజరా:—మీరు కాళిదాసుగారా? ఆనందమాయెను. మహాకవిగారూ మీరేనా నేఁ గట్టించిన దేవాలయమునుండి బ్రహ్మరాక్షసుని వెడలఁగొట్టినవారు?

కాళిదాసు:— నిజము.

[చిత్రకారుఁడొకఁడు ప్రవేశించి యొక చిత్రలేఖ రాజుగారికి నందిచ్చును. రాజుగారు దానిఁజూచి సంతసించి]

భోజ:— కవివరులారా! ఈచిత్రలేఖను జూడుఁడి.

భవభూతి మొదలగు కవులు:— రాణియగు లీలావతీదేవిగారిది. చిత్రమునగనున్న నున్నటులఁ జిత్రించినాఁడు.

భోజ:— కాళిదాసమహాకవీ! ఈచిత్రలేఖనుఁజూడుము.

కాళి:— [చక్కఁగఁజూచి] ఈచిత్రకారునకు సర్వజ్ఞత్వములేదు.

భోజ:— అదియేమి?

కాళి:— భూమిపాలా! ఇట్టియందముఁగల యమందయానకుఁ దొడపై నొక మచ్చయుండవలెను.

భోజ:— [విస్మయమంది] మహాకవీ! అదితమ కెటుల తెలియును?

కాళి:— అవనిపాలా! రవికాననిచోటు కవిగాంచును.

[వారవధూటి ప్రవేశించి]

వార:— భూమిపాలా! దండము. ధరణీసురోత్తములారా! వందనములు.

భోజరా:— వారిజలోచనా! నీ వెవరు? ఏకార్యంబునకై యిచటికివచ్చితివి?

వారవ:— భూపాలమౌళీ! నేను వేశ్యను. విద్యాసర్వస్వవేదిని యనుదాని శిష్యురాలిని. నారాణి ప్రపంచమెల్ల సంచరించి పండితవరులనెల్ల జయించి విద్యాసర్వస్వవేదినియనుబిరుదందినది. ధారానగరమున భోజభూపాలుని యాస్థానమునఁ బండితు లనేకులు గలరనివిని వారినిజయింపనిచటికి వచ్చినది. విద్యయందేమి మాయలయందేమి నారాణియతి చతుర. పండితుఁడు ప్రారంభమున నారాణిగారి శిష్యురాండ్రను గెలువవలెను. పిదపఁ బ్రసంగమునకు నారాణియేవచ్చును. అటువచ్చినను దన్నుజయించువఱకు జయించువానిమోముఁ జూడనపేక్షింపదు. ఎవఁడేనిజయించినచో వానికి మర్యాదగల దాసియైయుండును. భూమిపాలాగ్రణీ! నీసభయందెవ్వఁడేని పండితుఁడుండినచోఁ బ్రసంగమునకుఁ బంపనగును. లేదేని విద్యాసర్వస్వవేదినిలోఁ బ్రసంగించు కవులు మీయాస్థానమునలేరని లేఖవ్రాసియివ్వనగును. ఈకార్యంబునెఱవేర్ప, నారాణిగారి యాజ్ఞానుసారంబుగ నేను వచ్చినాను. ఈవిషయంబునం దమరానతి యెటులనో సెలవియ్యవలెను.

భో జ:— ఏమియచ్చెరువిది, ఒకవారధూటిజగత్తులోనుండు కవులనెల్ల జయించెనా? హా! హా! ఎంతటిది యీస్త్రీవిద్యాప్రభావంబు? మంచిది. నాయాస్థానమందుండు పండితు లెక్కరెక్కరే యీతిని ద్రిమ్మఁగఁగలరు. ఒకయబలవారికి లక్ష్యమా? కాని: పండితవరులారా! మీరు దీనమొకరుగ దానియింటికిఁబోయి యీయంగన గర్వభంగంబుగావించి దాని విద్యకి దీక్షికొని రండు. నాయాస్థానమునకు యశమార్జించి తేండు.

భ. భూ. మొ:— భోజభూపతీ! ఇన్ని దినములు తముపోష్యవర్గమునందుండి యీనాఁడు తము యశమునకుఁ గుందుఁ దేఁగలమా?

భో జ:— వేశ్యాంగనా! నీవుపొమ్ము. నీరాణిని జయించిదాసిగనొనర్చుటకు నాయాస్థానపండితు లుదిపదినము వత్తురు. ఈవార్త నీరాణికిఁ దెలుపుము.

వేశ్య.— [చిత్తమనుచు వందనములర్పించి నిష్క్రమించును]

భోజ.— కాళిదాసమహాకవీ! ఈవేశ్యను వర్ణింపుము.

కాళి.— " కచభారాత్కుచభారః, కుచభారాద్భీతిమేతికచభారః.
" కచకుచభారాజ్జఘనం, కోయంచంద్రాననే చమత్కారః.

భోజ.— మహాకవీ! నారాజ్యమెల్లనీకు నిచ్చిన నది తక్కువయని నేఁదలంచెద. కవివరులారా; నేఁడుకవితావిషయంబునఁ జర్చజరుగుచుఁగాలంబు మఱచితిమి. సాయంకాలమయ్యెను. మహాకవికాళిదాసా! నీవచనామృతముఁ గ్రోలనావీనులాసపడుచున్నవి. ఈసాయంకాలసమయమును వర్ణింపుము.

కాళి.— " వ్యసనిన ఇవ విద్యాక్షీయతే పంకజ శ్రీః
" గుణిన ఇవ విదేశే దైన్యమాయాంతి భృంగాః
" కునృపతిరివ లోకం పీడయత్యంధకారో
" ధనమివకృపణస్య వ్యర్థతామేతి చక్షుః.

భోజ.— మహాకవీ! ఉపమాలంకారమున నీవద్వితీయుండవని నేనిర్ధరించెద. రండుపోదము.

[నిష్క్రమణము)

## పంచమరంగము.

భోజరాజు - కాళిదాసు - భవభూతి - దండి - మాఘ - బాణాదులు

వేశ్య - భటులు.

భోజ.— మహాకవీ! అజ్ఞులుదమకుఁదెలివి లేకయున్నను ప్రాజ్ఞులను దప్పుపట్టుచున్నవారు. అదియేల?

కాళి.— భూమిపాలా! అదిసహజమేకదా?

" విపులహృదయాభియోగ్యే, ఖిద్యతికావ్యేజడోనమూర్ఖస్స్వే,
" నిందతికంచుకమేవ, ప్రాయశ్శుష్కస్తనీనారీ.

భోజ.— మహాకవీ! నీయుపమబహుస్వారస్యముగనున్నది. ఎండిపోయినరొమ్ముగల స్త్రీ తన్నుఁదాను దూషించి కొనక, రవికను దూషించినఁ బ్రయోజనమేమి? అజ్ఞుఁడు కావ్యార్థమును గ్రహింపఁ

జాలక కావ్యమును దూషించినఁ బ్రయోజనమేమి?

[వేశ్య ప్రవేశించి కేలు మోడ్చి.]

వేశ్య:— భూమిపాలా!

కం॥ దండిభవభూతి మొదలగు
పండితులెల్లరును నోడి పలుగిడిరి నృపా,
ఉండినమఱియేర్పఁగలా
పండితులగువారు, పంపుమా యతివేగన్.

మహీపాలా! నీయాస్థానకవులు గొందఱు మేముపన్నినయెత్తుగడలచే ఘోరమారమునుండి ఓటుపలుగిడిరి. భవభూతి, దండి, మాఘుకవులిల్లుఁ జేరిరి గానినా రాణిగారి దాసీజనులు వేయు ప్రశ్నలకు బదులిడఁజాలక పలుగిడిరి. రాజేంద్రా! నీసభనుమఱియేరైననుఁ బండితులుండిన వారిని పాతమునకుఁ బంపువటులమా రాణి వేఁడినది.

భోజ.— ఏమీ! ఏమీ! భవభూతి దండిమొదలగు పండితులు ఆవారవధూటీ సేవకాళికినోడిరా? నే నమ్మను.

[తలవంచి కొనిభవభూతిదండి వత్తురు.]

పండితవరులారా వందనంబులు. మీరుపోయినకార్యంబు జయప్రదమయ్యెనుగదా?

భవ.— భూమిపాలా! తెలుపసిగ్గయ్యెడు. ఆ విద్యాసర్వస్వ పేటికయొక్క దాసీజనుల మోముఁ జూచినక్షణముననే మాతివాగ్బంధనము సమకూరెను. మాటలాడఁజాలమైతిమి. మఱిఁ బోలువిద్యార్థులు లేయిటులైనచో మఱియొవరు వారినిఁ గెల్వనోపుదురు.

దండి.— భోజనృపతీ! ఆ రోవెలఁదిచే నోడి పరిభవమందుటకంటెను జయలేఖ యిచ్చివచ్చుట శ్రేయమని నాకుఁ దోఁచెను.

భోజ.— హా. హా! భోజుని తేజము దిగ్గాజితమై వెలయుచుండెనుగదా; నేటికినొకరూపాజీవకుఁ జిక్కి కందుఁగాంచెను. ఏమిసేయుదు. ఈపరిభవమునుండి నన్నుఁ దప్పించువారెవరు? [కాళిదాసునిఁ జూచి] వరకవీ! కాళిదాసా! ఇట్టియాపత్సమయమున నీవుదప్ప నాకు నన్యశరణంబు లేదని నమ్మినాను. నీ పదములపైఁబడిరోదను.

కాళి:— భోజనృపతీ! ఆవారవధూటినిజయింపనింతగఁ జింతిల్లెదవేల? నాసామర్థ్యంబంతయుం వెచ్చించియా స్త్రీని నా దాసిగఁగొనివచ్చెద.

భోజ:— మహాకవీ! ముదమందితి. నీవే నా ప్రాణమిత్రుఁడవు. నాయాప్తబంధువు. [వేశ్యనుఁ జూచి] వారవధూటీ! నేటిదినముననే, నీరాణినిజయించి దాసిగఁగొని తెచ్చు మహాకవినిఁ బంపెద. నీవు వెళ్లుము.

వేశ్య:— [చిత్తమని దండమిడిపోవును].

భోజ.— మహాకవి కాళిదాసా! మనమెల్లరముఁ బోవుదము రమ్ము.

[నిష్క్రమణము.]



# కాళిదాసనాటకము.

## చతుర్థాంకము - ప్రథమరంగము.

విద్యాసర్వస్వవేదినియింటియంగళము. కాళిదాసు.

కాళిదా:— అదిగో యెదురుగ నుండునదియ యావిద్యాసర్వస్వవేదినీగృహవీథి కాఁబోలు. దాసీజనులెచటనున్నవారో? అదిక్కునకుఁ బోయిచూచెద. (అని వెనుకకుఁబోవును)

(విద్యాసర్వస్వ వేదనియును దాసీలుఁగూడఁ బ్రవేశింతురు.)

విద్యాస:—(దాసీజనులఁజూచి) వారిజనయనలారా! నేఁడుమమ్ముజయింప నెవ్వఁడో మహాకవివచ్చుచున్నవాఁడఁట. నేనుమీకు నేర్పినతాంత్రికవిద్యల నెల్లఁబ్రయోగించివచ్చువాఁడు నాగృహముఁజొరనీకయుండునటులఁజేయుఁడి. తాంత్రికవిద్యలో మిమ్ముఁగెలిచినచో నిజముగ విద్యావిషయమునఁ బరీక్షింపఁగొందఱిని సిద్ధపఱచెద. మీరు వేషధారులగుటకుఁ బొండు. నేనునువచ్చెద.

(దాసీలు వెడలుదురు.)

చం. విరహదవాగ్ని నేనెటులవీసరఁబుచ్చుదు; భర్తకౌఁగిలిన్
బొరయుచుసౌఖ్యనీరధిని భూరితరంబుగమున్గకున్న; వే
సరకిటులెంతకాలమయొ సానులమాయలుపన్నుచుండుదున్
బురుషవిహీనయౌతరుణి, భూమిజనించుట వ్యర్థమేగదా?

తరుణులకీ ధరణి విరహంబతిభారంబు. ధరింప నలవికాదు. ఆ సత్యసంధుఁడు వీరయోగి మాటలునమ్మి నాడు నా ప్రాణంబుఁ ద్యజింపనైతిని. యోగిమాట లళీకములుగ నుండునా? ఉండవు. అటులైన నన్ను జయించి నాపతి నాసరసకు రాడయ్యెనే? ఎన్నిదినంబు లిటులుండుదు? ఎచటనో కాలిచప్పుడగుచున్నది. నేఁ బోయెద.

( తల్లి - బిడ్డ - మనుమరాలు ప్రవేశింతురు. )

తల్లి:— బిడ్డా! రాఁబోవు కవిని మేమెటులయినను రాణిగారి గృహము బ్రవేశింపనటుల తంత్రము పన్నవలెను. అదిగో యెవఁడో రాజువలె గంభీరముగ నడచివచ్చుచున్నాఁడు. వీనిని మన వలలో వేసికొనిన మా రాణిగారి గృహముఁ బ్రవేశింపఁడు. సమీపమునకు రానిమ్ము.

( కాళిదాసు ప్రవేశించును. )

( వేశ్యలు నమస్కరించి )

తల్లి:— స్వామీ! మీరేమి భూదారులో; విభ్రమముఁ జూచినచో నటులనే యగపడుచున్నది.

కాళిదా:--( స్వగ ) ఈ వేశ్య దాసి చమత్కారముగ ద్వంద్వార్థమిచ్చు భూదారశబ్ద మువయోగించెను. భూదారశబ్దము పందికిని, ప్రభువునకు నుపయుక్తమగును. మంచిది దీనికి బదులిడెద. (ప్రకా) వారిజాక్షీ! మేము భూదారులముకాము. భూసురులము. మీరెవరు భూదార కులమువారో?

వేశ్య:— స్వామీ! మేము భూదారలము కాము. జారదారలము.

కాళిదా:--( స్వగ ) దీనిమాటలు బహుచమత్కారముగ నున్నవి.

వేశ్య:— స్వామీ! తాము జారులుగ నున్నవారు వేశ్యవాటికఁ జొచ్చితిరి.

కాళిదా:--నిజము. మేము విద్యాజారులము.

వేశ్య:— స్వామీ! మీ రొక విధమగు విద్యలము మీరు జారులు సరిపోయినవి.

ఉ. మొల్లసుగంధి కూఁతురది ముంగిటనున్నది దానిఁజూడు, ము
త్ఫుల్లసరోజ నేత్రయిది పుత్రికపుత్రిక దీనిఁజూడు, నే
నెల్లవిధంబు లన్రతుల నేలెడిదానను నన్నుఁజూడు, నీ
వల్లుఁడవయ్యెదో మగఁడవయ్యెదవో మనుమండవయ్యెదో?

కాళిదా:-- ( వినోద కథా కల్పవల్లి )

( స్వగ ) ఇది నాపనికి నీవిథముగ నంతరాయముఁ గల్పించుచున్నది. దీని నీవిధముగ నోడించెద. ( ప్రకాశముగ )

చ. మొల్లలగంధి కూఁతురది ముంగిటనున్నది దానిమాన, స్ఫు
త్ఫుల్లసరోజ నేత్రయిది పుత్రికపుత్రిక దీనిమాన, నీ
వెల్లవిధంబు లన్రతులనే లెడిదానవు నిన్నుమాన, నే
నల్లుఁడనయ్యెద న్మగఁడనయ్యెద, నీమనుమండ నయ్యెదన్.

వేశ్య:— ఛీ ఛీ ఛీ యనుచు ( స్వగతము )

ఈ లోకములో భోగమువారు వావివరుసలు లేనివారని నిందించెదరు. వారు మానవంతులు. వావివరుసలు చూచువారు బ్రాహ్మణులే. వావివరుసలు సరకుసేయనివారని యితఁడు స్థాపించెను. నే నొకటి చేయఁదలంచిన వేఱొకటియయ్యెను. నే నోడితిని. రండి బిడ్డలారా! ఈ వావివరుసలు చూడనివానితో మనకేమి సంబంధము? ( అనుచు వెళ్లుదురు. )

కాళిదా:--వేశ్యలు మాయలువన్ని యీరీతిగ నన్ను మోసగించి పూనినపని వ్యర్థముగులాగు చేయఁ జూచిరి. వీరినిఁ గెలిచితి. ముందే యంతరాయము మావిద్యానర్వస్వ వేదిని కలిగించునో చూచెద. ( అనుచు ముందరికి వెళ్లును. )

[ ఒకముసలిది యనేకసుత సుతులతోఁ బ్రవేశించి కాళిదాసునిఁజూచి ] ఓహెూ చిక్కితివి చిక్కితివి. ఎన్నాళ్లు తప్పించుకొని తిరిగెదవు? నీకుఁగాను దేశదేశ మీపిల్లలతోఁ దిరిగితిని. నీకుఁగొంటుఁ జాచినందులకును గొంగుపఱచినందులకు ఫలంబు నాకడుపుచెలంచు నీకొడుకులు క్రొమాశ్రితై రి. వీరిని నేను సాకలేను. వీరును నేనును నీ సొత్తుగ నున్నవారము. మమర క్షి

చుపని నీవి. తప్పితివేని నీవిషయమున రాజుగారికి నభియోగము సల్పెద.

కాళిదా:--[ దూరమునకువచ్చి ] ఇది రెండవతంత్రము. నే నిపుడు దీనివచనంబు నిరాకరించితినేనిది తంత్రజ్ఞుండని కాండను నందవచ్చును. దీనికొక మారుతంత్రముం జేయవలెను. మంచిది [ప్రకా] మానినీ నీవు నన్నుఁ బెండ్లిసేసికొన్నది నేను మఱచినాను. నీ వజద్ధమాడవు కావున నీమాట నెమ్మినాను. మీ రెల్లరును నా సొత్తులుకదా?

భార్య:— నిన్నుఁ గట్టికొనిన నేను నీ సొత్తుఁగాక మఱి రొవరిసొత్తు నగుదును? సర్వమునకు నీవే బాధ్యుండవు.

కాళిదా:-- అటులయిన నా వెంటరండు.

భార్య:— వచ్చెదము [ పోవుచుందురు ]

[ వర్తకుఁడొకఁడువచ్చి కాళిదాసునిఁజూచి ]

వర్తక:— ఏమయా! నీది యేయూరు?

కాళిదా:--నాది ప్రపృచ్ఛనగరము.

వర్తక:— ఏమీ ఏమీ! పపృచ్ఛనగరమా?

కాళిదా:-- కావయా! ప్రపృచ్ఛనగరము.

వర్తక:--- కానయ్యా! పపృచ్ఛనగరమో యొకపృచ్ఛనగరము. నీ పేరేమయ్యా?

కాళిదా:-- ప్ర ప్రపితామహుండు.

వర్తక:---ఏమయాయిది? పపపితామహుడు ఎచ్చటపేరయ్యాయిది?

కాళి.--- ప్రప్రపితామహుండయా

వర్తక:--- ఏపేరైననుగాని నీది యేకులమయా?

కాళిదా:-- ప్ర బ్రాహ్మణాన్వయము.

వర్తక:--- ఏమిది. ఇటుపలికెదవు? వత్తులు లేక చెప్పవయా! వత్తులు నాకు రావు!

కాళిదా:---అపశబ్దములు నాకు రావయా.

వర్తక:--- మఱియొకతూరి చెప్పవయ్యా పేరు.

కాళిదా:--ప్రబ్రాహ్మణాన్వయము.

వర్తక:--- ఏమోపో; నీగోడు నాకుఁదెలియదు. ( వెళ్లును )

( మఱియొక వర్తకుఁడు తాటాకుల పుస్తకముతోవచ్చి కాళిదాసునిఁజూచి )

2-వర్త:—ఎన్నాళ్లకుఁ జిక్కితివయా; ఎన్నాళ్లకుఁ జిక్కితివి. నా సొమ్మెగరవేయఁ జూచితివియా? మంచి గట్టివాఁడవు.

కాళిదా:--ఎవరయానీవు? నీ సొమ్మేది?

2-వర్త:---అదికదా సొమ్మెగరవేయు లక్షణము? ఏమయా నీది పపృచ్ఛనగరముకదా?

కాళిదా:-- ప్రపృచ్ఛనగరమయా

2-వర్త:---నిజము నిజము. ఆదే అదేను. నీపేరు పపితామహుడుకదా?

కాళిదా:-- ప్రప్రపితామహుండయా?

2-వర్త:---నిజము. అదేను అదేను. నీ కులము పబ్రాహ్మణాన్వయముగదా?

కాళిదా:-- ప్రబ్రాహ్మణాన్వయమయా

2-వర్త:---నేను చెప్పునదదేను. ఏమోయి దగాకోరీ! నీ పెండ్లికని రొన్నో రోజుల క్రిందట నాతో వెయ్యివరహా లప్పుపుచ్చుకొని పెండ్లిచేసికొని నాఋణము దిగమ్రింగి మఱుగిడితివియో? నేను మఱచిపోదునని తలంచితివి కాంబోలు; ఎన్నటికి మఱవను. నేను వర్తకుండను. వైశ్యుని కుమారుండను. నాకు రాందగినసొమ్ము నేను మఱతునా? నేను మఱచినను నా తాటాకుల కవిలెలెక్క మఱచునా? ఇదిగో చూడు నీలెక్క ( అనుచుం దాటాకులెక్క చూపును. )

కాళిదా:--( చూచి ) ఇది నా హస్తాక్షరములం కావే?

2-వర్త:---నీవికానిచో నీ యబ్బవియా? ఇపుడు నీకుంగాను నే సృష్టించితినా? నీకునాకు ద్వేషమా? సాక్షుల పేర్లు చూడుము. కాలమునుబట్టి నీ యక్షరములలో మార్పులయి యుండునుగాని నా లేఖలో మార్పు లెన్నటికిని రావు. దినదినము వ్రాసి నిలువకట్టు లెక్కయిది. హెచ్చరిక నన్నేమియిన ననిన ననికొనుముగాని నాలెక్కకుం బేరుపెట్టేవుసుమా?

కాళిదా:--( దూరమువచ్చి ) నన్నోడింపం బన్నిన మూండవతంత్రమిది కానిమ్ము. దీనికి మారుతంత్రము పన్నవలెను. ఓయీ! వర్తకశిఖామణీ! నీవు గొప్పవాండవు. నీమాట నే నమ్మెద. నీ లెక్క లేల?

2-వర్త:---అదికదా పెద్దమనిషిమాట. అటులైన నా సొమ్ముకక్కుము.

కాళిదా:--అయ్యా! నావద్ద నొకపైసాయయినను లేదు. ఏమి సేయుందును.

2-వర్త:—ఏమయ్యా! ఋణము ముంచుట ధర్మమా?

కాళిదా:-- వర్తకాగ్రేసరా! నీవు ధర్మమాయని పలికినతోడనే నాకు ధర్మశాస్త్రము జ్ఞప్తికివచ్చెను. ధర్మశాస్త్రమును దాంట, రాజునకునైనను శక్యముకాదు. నా శిపుడు స్వాధీనమందుండు సొత్తు యీ నా దార, యీ నా సంతతి. నేను మఱలవచ్చి ఋణముం దీర్చునంతవఱకును వీరిని నీవద్దం దాకట్టుగనుంచెద. ఋణముతీర్చినపిదప వీరినిం బిలిచికొనిపోయెద. ( భార్యనుం జూచి ) ఏమే నీ పెండ్లికింగాను చేసిన ఋణమేయిది. నేనీవర్తకుని ఋణముం దీర్చునంత వఱకు మీ రెల్లరు నీవర్తకుని యాధీనములో నుండుడి.

వర్త:— (దూరమునకువచ్చి) అయ్యవారినింజేయబోయినం గోతిపిల్లయాయెను (వెళ్లిపోవును.)

భార్య:— మంచి మగనిని ముడివేసి కొంటిని (వెళ్లిపోవును)

కాళి.--- ఇపుడీమూడు తంత్రములు వ్యర్థపఱచితి. ఇంక నెన్ని తంత్రములు పన్నుదురో చూచెద. తంత్రవిద్య యంతయును నేటికిముగియునిమ్ము. ఈపటినుండి నావిద్యా ప్రభావంబుంజూపెద.

[వేశ్య వాటికలో సంచరించుచుండును ఏకాక్షి — వికలహస్తుడు—పంగువు ప్రవేశించి కాళిదాసునింజూచి.]

ఏకాక్షి:—ఏమయా నీవు మాకుబహు దినములుగం గావలసినవాండుగ నుంటివి. అపుడు నీకొకకన్నుండలేదు. ఒకచేయియుండలేదు. ఒకకాలుండలేదు కురూపి యనిరొమొవరును నీకుంబిల్ల నియ్యరైరి. మమ్ము బహుదినములు బతిమాలికొనంగా " ఏమో పెండ్లికార్యము విఘ్నముసేయరాదని " గొప్పబుద్ధితో నేనువాకన్నిచ్చితిని. ఇతండుతనచేయియిచ్చెను. అతండుతనకా

లిచ్చెను. అన్నియుసవరించికొని పెండ్లియయినతోడనే, ఫలాయనమంత్రము పఠించితివి. ఔరా! నీవెబ్బ మంచిమాటలతో, మాకన్ను చేయి కాలు, కత్తరించి యిచ్చిపొమ్ము. మంచిమాటలతో నిన్ను వదలము.

కాళి:— [స్వగ] వనోన్నడింపనిది నాల్గవతంత్రముకాఁబోలు మంచిది దీనినోడింప మారు తంత్రమొకటి పన్నెద. ] మిత్రులారా! మీరొనాఁడునాకొనరించిన యుపకృతి నేనెన్నటికిని మఱువను. కార్యబాహుళ్యమున నేను దేశసంచారమొనర్చుచు నేఁడేయిచ్చటికి వచ్చిమిమ్ము వెదకుచుంటిని. మీ మీ యంగములు మీకునిచ్చుటకు నేనుసిద్ధుఁడుగనున్నాను. అయితే యొక కత్తియు నొకత్రాసును దెప్పింపుడు.

ఏకాక్షి.—నిజముఁ అగత్యముగఁదెచ్చెదను. ఇపుడే తెచ్చెద.

[త్రాసునుఁగత్తియుఁదెచ్చును]

కాళిదా.—ఏమండయ్యా! మీరేయేయంగమున నెంతటితూకము మీయంగములిచ్చితిరో యంతమట్టుకునిపుడుండు మీ యంగములఁగత్తరించి త్రాసునకొకప్రక్కనుంపుడు. పిదపనాయంగమంతమట్టుకే యంతటితూకమే కత్తిరించి త్రాసునమఱియొక ప్రక్కన నుంపుడి. హెచ్చరిక తూకము హెచ్చు కానటుల చూడుఁడి. హెచ్చుకత్తరించినచో రాజుగారికిఁ జెప్పిమిమ్ములఁ దీయింతును.

[ఏకాక్షి మొదలగువారొకరి మొగ మొకరుచూచుచుఁబఱుగిడుదురు.]

కాళి:— ఏమండయ్యా! మీయంగములు మీకువలదో? అటులేల పఱుగిడుదురు? (స్వగ) ఇదినాల్గవ తంత్రము. మఱియేతంత్రమును బన్నెదరో చూచెద.

కాళి:— ఆవిద్యాసర్వస్వవేదినిపన్నిన తాంత్రికప్రయోగము లెల్లవ్యర్థపఱచితిని. ఇఁకనిజముగ నావిద్యాప్రభావంబుఁజూపవలెను. ప్రొద్దుచాలయినది రేపటిదినంబునవచ్చి దాసీలను గొందఱితో వాదము సల్పెద. వారియోగ్యత యెంతయున్నదియో చూచెద.

శ్లో. కేయూరాణినభూషయంతి పురుషం, హారానచంద్రోజ్వలా.
" నస్నానం, నవిలేపనం, నకుసుమం, నాలంకృతామూర్థజా ః
" వాణ్యేకాసమలంకరోతి పురుషం. యాసంస్కృతాధార్యతే.
" క్షీయంతే ఖిలభూషణాని సతతం వాగ్భూషణం భూషణం "

(భర్తృహరి.)

[నిష్క్రమణము]

ద్వితీయరంగము.

విద్యాసర్వవేదినీగృహము - సరస్వతి - గౌరి

చారులోచన - విద్యాసర్వస్వవేదిని.

విద్యాస:—చెలులారా; నేఁడునాకేమియుఁదోఁపక యున్నది. నిన్నటి రేయినేనొకవిచిత్రమగు కలఁగంటిని. ఆకాలమునుండియు నామనము కళవళపడుచున్నది.

సరస్వ:—అదిఏమికల?

విద్యాసర్వస్వ:—చెప్పుటకు సిగ్గులచేటుగనున్నది. అయినను నాసుఖదుఃఖభాగరులగు మీకుఁజెప్పక మఱినేరికిఁ జెప్పఁగలను?

సీ. కుసుమశయ్యపై నేను సుఖముగనిద్రించు
చుండ సుందరరూపుఁ డొకఁడువచ్చి
చేరువఁ గూర్చుండి జిగిబిగిచెలువారు
చెక్కులునొక్కుచుఁ జెన్నుమీఱ
నధరామృతముఁ గ్రోలి యానందమందుచుఁ
దమితోఁ జనంగముల్దవిలిదవిలి
యెత్తికవుఁగిటఁ గుచ్చి చిత్తజుకేళిలాట
లాడయత్నించిన యపుడె నేను

గీ. లేచిచూచిన నందెవ్వ లేరుతరుణి
కుట్టికలఁగంటిఁ గలకంఠి గుట్టుఁజెప్పితి
ఆ మహాపురుషుఁ జెప్పుట నరయలేదు
మీఁజాలను విరహాగ్ని తాపమేను.

చారు:— అమ్మా! నీకలలోవచ్చిన పురుషుఁడీప్రదుమనతో వాదింపవచ్చు మహాకవియయుండునా? అమ్మా నేనామహాకవిని దూరమునుండి చూచివాను నీకలలోవచ్చినపురుషుని యంగసౌష్ఠవము నీవు వర్ణించినచో నేనతనినిఁ బోల్పఁగలను.

విద్యావర్తి:— అమ్మా ఆపురుషుఁడు నవమన్మథుండని వర్ణింపనగును.

సీ. భూమీసురాన్వయ పూజ్యుఁడు భుజగేంద్రు
నగియెడి యెగుభుజయుగము వాఁడు
జానొప్పఁగాను భూజానులఁ బోలునా
జానుబాహోన్నతిఁ బూనువాఁడు
తలపులవై శాల్యమలయింపఁగలయట్టి
వెడదగు రొమ్మున నడరువాఁడు
కేసరికాను నాకేసరియనికేటి
పిడికిటనడఁగెడు నడుమువాఁడు

గీ. అంగసౌందర్యమునకెల్ల నాలవాల
మైనపైడి మెఱుంగులమేనివాఁడు
మదవతులపాలిమదనుఁడు మానధనుఁడు
పురుషమాత్రుఁడె యామహాపుష్పధన్వి.

చారులో:— అమ్మా! నీవువర్ణించునట్టి యంగ సౌష్ఠవము కలవాఁడే యిపుడు మాతోవాదింపవచ్చు చుండు మహాకవి.

విద్యా:— అటులయిన నాభాగ్యము ఫలించెననుటకు సందియములేదు. అయినను మన్మనెల్లరనతఁడు జయింపవలెనుగదా?

భాఘు:— మమ్ముఁబరాజితలను జేయుటకు సందియము లేదు. ఆ మహాకవి ప్రతిభ వాగ్ధోరి వాక్చాతుర్యములను జూచిన, నతఁడు పాండిత్యమునన ద్వితీయుండని దోఁచెను.

(వెలినుండి ఘంటానాదము వినఁబడును)

విద్యా:—అదిగో యామహాకవివచ్చుచున్నట్లున్నది. మీరుపొండు.

(లోనికి వెళ్లుదురు.)

(కాళిదాసు ప్రవేశించును)

కాళి:— ఆదిరేమిగి నేఁడుదా నీలెక్కరును సాక్షఁగానుగాచియుండరు. ఇంకొక్కైదునిమిషములు వేచియుండెద.

[సరస్వతి - గౌరి - చారులోచనలు - తాంబూలముతట్టలతో ప్రవేశించి.]

చారు:—మహాకవీ! నీవసదృశ కవితాశేముషీవిశేషుండవని మీకుఁ బ్రారంభమునఁదాంబూలమిచ్చి సత్కరింపవచ్చినాము. మమ్ము వర్ణించుచుఁ దాంబూలముల స్వీకరింపుము.

కాళి:— చేటీజనులారా! వాలోపిటీకథ వార్త మీరాణిసేయుంపగినది. అయినను తాంబూలము స్వీకరింపుఁడని మీరు వేఁడెదరు కావున మిము వర్ణించుచు వానినిస్వీకరించెద.

"తాళీకారసయోధరే తనుభువస్త్రాంత్రాధికాంతశ్రియే.
"తామ్యన్మధ్యలతే, తటిత్సమరుచే, తంత్రీసమాలాపినీ
"తాటంకకాంత తరంగితాక్షియుగళే తన్వంగి తామ్రాధరే
"తారానాథ నిభాననే తవకరాత్తాంబూలమానీయతాం.

(అనుచుఁజారులోచన చేతితాంబూలమందును.)

"రాజీవారుణచారుపాణి యుగళే రాకేందుదర్పాననే
"విద్యుద్వల్లిసమానదేహలతికే, మత్తేభకుంభస్తనీ
"రంభోరూ, రమణీయ ఫాలతిలకే కాసుంభవాసాన్వితే
"ముక్తాహారధరే, ప్రియే. తవకరాత్తాంబూలమానీయతాం.

(అనుచుగౌరియిచ్చిన తాంబూలమందును.)

"కస్తూరీ పరిమోదభృంగ శకలం కర్పూరఖండాన్వితం.
"ముక్తాచూర్ణసమేతమిందు కిరణైస్స్వచ్ఛాయవల్లీదళాం,
"తత్తాదృజ్మద నాగమోక్తసురతప్రస్తావవిస్తారకం.
"కల్యే, కల్పలతాసమే, ప్రియతమే తాంబూలమానీయతాం॥

(సరస్వతి చేతితాంబూలమందును.)

చారు:—[ వందనము లొనర్చి ] మహాకవీ! మీ యద్వితీయ కవితా చమత్కృతికి మేమెచ్చుకొంటిమి. మీకు నోడితిమి. మిమ్ముఁ బరీక్షింప మా విద్యా సర్వస్వమేదిని రాణిగారొప్పనుగాని మఱియేరికిని సాధ్యము కాదు. సెలవిచ్చిన మా రాణినిఁ బంపుదుము.

కాళిదా:--పంపుడి, త్వరలోఁబంపుడి. [దాసీలు నిష్క్రమింతురు ]

ఆ విద్యాసర్వస్వవేదినిసిఁ జూడ మనమేలొకో యువ్విళు లూరుచున్నది. దానిచేటీలకు నింతటి విద్యాపటిమ ముండునపుడా వధూటి విద్యాప్రభావ మెంతగ నున్నదియో? కానిమ్ము. సర్వమునకు నా లోకజనని నా జనని యండయున్నది. ఆ విద్యా సర్వస్వవేదిని వచ్చుటకు నించుక కాలమగునని తోఁచెను. అంతదాఁక యీ వేశ్యవాటికలో సంచరించు చుండెద.

[ అనుచు మఱుఁగగును విద్యాసర్వస్వవేదిని ప్రవేశించి ]

విద్యాస:--హా హా! ఆ వరకవి యెంతటి మహామహిముఁడో నా శిష్యు లెన్ని విషమ సమస్యలిచ్చినను తోడనె వానినెల్లఁ బూర్ణమొనరించి వారిని నోడించెనఁట. అతని ప్రతిపదమునందు నమృత మొలుకుచుండునఁట. ఉపమ లతిరుచ్యములయి మనోహ్లాదములు గలిగించు చుండునఁట. ఇది కదా మహాకవిలక్షణము. ఈ మహాకవియ యుండునా. నిన్నటిరేయి నన్ను సుఖ నీరధిలోఁ దేల్చినవాఁడు? అతఁడు పరపురుషుఁడు కాడని నా యంతరాత్మ తెలుపుచున్నది కావున నే నేర్పఱచిన విధికి విరుద్ధముగ నే నతనిరాకుటఁబడి వాదించెద. నే నోడినను నన్నా పురుషుఁడు బాధించిన తప్పు మఱపను. నేనును గొంతకాలము బాధించి తప్పించుకొనిపోయి భోజుని యాస్థానమున నే నతనిభార్యనని స్థిరపఱచి మఱల వివాహమాడెద. ఇదియు నా సంకల్పము. ఎవరిదో కాలిచప్పుడగుచున్నది. ఆ మహాకవియుండును.

( కాళిదాసు ప్రవేశించును )

కాళిదా:-- వారిజపత్రనేత్రా! నీవేనా విద్యాసర్వస్వవేదినయను వేశ్యవు?

విద్యా:— మహాకవీ! నేనే యాపేరుదానను. అయితే నేను సామాన్యవేశ్యను గాను. మహిని జయించిన మహామహుఁడగు కళానిధి నన్ను జయించెనేని నతనికి మర్యాదమీఱని దాసిగనుండు, వేశ్యను.

కాళిదా:-- అటులైన నిన్ను జయించుటకు నేను సిద్ధుఁడుగ నున్నాను. ఏదీ నీవేమి ప్రశ్నించెదవో ప్రశ్నింపుము.

విద్యా:— మంచిది. [స్వగ] [ వీఁడు కఠినహృదయుఁడయి యానాఁడు నన్ను వదలిపోయెను. దానిని గుఱించి యొక సమస్యనిచ్చెద]. మహాకవీ! నేనిచ్చు సమస్యను పూర్ణము సేయుము.

“ తథాపిదూరాయి, యద్గ్రంథిలంచ కుటిలం హృదయం బిభర్షి ”

కాళి:—“ దిఙ్మండలం పరిమళై స్సురభీకరోషి ”

“ సౌందర్యమావహసిలోచన లోభనీయం ।

“ ఆహారసాల ఫలవర్య తథాపిదూరాయె ।

“ యద్గ్రంథిలంచ కుటిలం హృదయం బిభర్షి ॥

విద్యాస:—మహాకవీ! నిజమువలికితివి. తనపరిమళము దశదిశలు వ్యాపింపఁజేసి కన్నులకు సంతసము గలిగింపఁ జేయు తియ్యనిమామిడిపండు తనలోఁ గుటిలమైనట్టియుఁ గఠినమైనట్టియు విత్తును నుంచికొని యనుభవింప నర్హముకానిది చూచినచో దుఃఖమురాదా?

కాళిదా:— నిజము. దాని జననస్వభావమది. ఏమిసేయననగును?

విద్యాస:—“ పరందుఃఖం, యద్గుంజా సమతోలనం”

కాళిదా:—“ హేమ్నఃఖేదో నతాపేన, ఛేదేన కషణేనచ”
“ తదేవహిపరం దుఃఖం యద్గుంజా సమతోలనం”

విద్యాస.--మహాకవీ! బంగారము, కాచినను ఛేదింపఁబడినను, నొఱయికరాలిచే రుద్దఁబడినను, దుఃఖింపదు. గురిగింజతో సమానముగాఁ జూచినపుడు మాత్రము, దుఃఖించును. అటులనే కులసతి మగఁడు తన్నెంతకొట్టినను, తిట్టినను, దుఃఖింపదు. తన్నొక తుచ్ఛస్త్రీగాఁ దలంచి సరకుసేయఁడేని దుఃఖించునుగదా?

కాళిదా:-- నిజము. అదే నా యాశయము.

విద్యాస:--“ మావిముంచపునరస్య సౌహృదం ”

కాళి:—“ కంచిదేవ సమయం సమాగమా ”
“ త్వాంనవిస్మరతి శశ్వదంబుజం ”
“ మానసే విహరహంస, మానసే ”
“ మావిముంచ పునరస్య సౌహృదం ”

విద్యాస.--మహాకవీ! సహజమయిన సంగతిపలికితివి. హంససమాగమము కొంతకాల మంబుజమునకు నుండినను నా యంబుజము తనతో స్నేహము మఱవక యుండుమని హంసను వేఁడికొనుట లోకానుభవమున సహజముకదా?

కాళిదా.--నిజము నిజము.

విద్యాస.--“ నహికృత ముపకారం సాధవో విస్మరంతి ”

కాళి:—“ ప్రథమతయసిపీతం తోయమల్పం స్మరంతః ।
“ శిరసినిహితభారా నారికేళా నరాణాం ।
“ సలిలమమృతకల్పం దద్యురా జీవితాంతం ।
“ నహికృత ముపకారం సాధవో విస్మరంతి ॥

విద్యాస.--మహాకవీ! జడపదార్థమగు నారికేళవృక్షము తనకుఁ జిన్ననాఁడు పోసిరక్షించిన జలమును దలపైనుంచికొని నరులకు నిచ్చుచున్నది. చిన్ననాఁడు తనకు జనులు చేసిన యుపకారము మఱవకయున్నది. భూజనులుమాత్రము జ్ఞానహీనులయి యితరులు తమకొనరించిన యుపకారమును మఱచి కృతఘ్నులై యుందురు.

కాళిదా.--స్త్రీరత్నమా! అదినిజము.

విద్యాస.--“ మనుష్యరూపాః పశవశ్చరంతి ”

కాళి:—“ ఏషాంనవిద్యా, నతపో, నదానం ।
“ నచాపిశీలం నగుణా నధర్మః ।

" తేమర్త్యలోకే భువిభారభూతాః ।
" మనుష్యరూపాః పశవశ్చరంతి ॥

విద్యాస.-- మహాకవీ! ఎవనికి విద్యయుఁ దపము దానశీలములు, సుగుణము ధర్మములేవో యట్టివాఁడు భూమికి భారమై పశువుబలెఁ దిరుగుచుండుననికదా నీ భావము.

కాళిదా.-- నిజము. అదియే నా యాశయము.

విద్యాస.-- [దూరమునకువచ్చి] స్వగ ఈ పురుషుఁడు నేనిచ్చిన సమస్యలు నా నోటిలో మాటయుండఁగనే పూర్ణమొనరించు చున్నాడు.

కాళి:— మానినీమణీ! నేనొకశ్లోకంబుఁ బఠించెద, నా శ్లోకభావంబుఁ దెలుపుము.

" నవకువలయపాళీ కల్పితానల్పచూళీ
" కమితురు పరకేళీ కాఽపి కాచిచ్చోళీ

" అమిత తిమిరజన్యాం మధ్యమాయాం రజన్యాం
" అమల కమలగంధైర్వ్యాప్య పయాతూ సపాథం.

విద్యాసర్వ:— (దూరమునకువచ్చి. స్వగ.) ఈమహాకవి పఠించిన శ్లోకభావము నాకుఁ దెలిసినను నే నెటుల లజ్జవదలి మగవానికిఁ దెలుపుదును? అటు తెలిపినచో నతఁడు నా విషయ మేమి దలంచునో గదా? తెలుపకున్న నే నోడినదాననగుదును. తెలిపినచో నేను జారిణియనెడి యపనిందవచ్చును. అపనింద వచ్చుటకంటెను మహాకవికి నోడి నను పేరువచ్చినను రానిమ్ము. ఇంతవు నీ మహాకవి నన్ను బెండ్లాడిన పురుషుఁడేను. వీరయోగి మాట నేఁటికి ఫలము యయ్యెను. ఐనను నేనీ పురుషునకు సుకరముగ స్వాధీనపడరాదు. వాని యిష్టార్థమునకు నింపుక యంతరాయంబుఁ గల్గించెద. ( కాళిదాసుని సమీపించి ) మహాకవీ! ప్రపంచము లోఁగల పండితులను జయించిన నన్ను నీవు జయించితివి. నీ శ్లోకభావంబు నేఁ దెలుపఁ జాలను. ఇపుడు తమయిష్టార్థంబేమి?

కాళిదా:--అంబుజవదనా! నా యిష్టార్థంబు పద్యరూపంబునఁ దెలిపెద వినుము.

ఉ. కన్యకునైదు పాదములు, కన్యకు నేడువిలోచనంబులున్,
కన్యకునాల్గు కన్బొమలు, కన్యకునాఱు కుచద్వయంబులున్,
కన్యకు ద్వాదశంబనఁగఁ గారణమధ్యము మున్నయట్టి యా
కన్యకునీకు, నాకుఁ,బదిగా పలెఁగా, యిపుడంగ నామణీ.

విద్యాస:-- మహాకవీ! నీ పద్యభావంబు నేఁ దెలిసితి. దీనికి సమమైన సంస్కృతశ్లోకము మున్నొకకవి రచించినాఁడు.

కాళిదా:--ఏదీ యాశ్లోక మెటులున్నదో వినియెద.

విద్యా:— " సంతప్తాదశ మధ్వజాత్ర నికరైస్స మ్మార్భితా నిర్జలే
తుర్యద్వాదశవద్ద్వితీయ గతినాచైకాద శాభస్తనీ

సాషష్టీ కటిపంచమాచ నవమభ్రూ, సప్తమీవర్జితా
ప్రాప్నోద్యష్ట మవేదనాం త్వమధునా తూర్ణం తృతీయోభవ.

మహాకవీ! ఇదియకదా నీ యాశయము. అటుల మనకిరువురకు దాంపత్యమెటు ఘటిల్లును? నేను వారవధూటిని. నీవు భూసుర వరేణ్యుఁడవు. మనకిరువురికి వివాహవిధులు లేవుగదా?

కాళిదా:--వివాహవిధుల జోలి మనకేల? నీవు దాసిగ నాకు శయ్యాసుఖంబులు సంఘటింపఁ జేయుచుండుము.

విద్యాస:--పండితవర్యా! సకలశాస్త్రంబులు చదివిన నీవీరీతిగఁ బలుకనగునా? నీకు నేను విద్యాదాసినగుదునుగాని యనురాగ దాసిని గాదుకదా? దాసినగుదునని నా శపథముగాని భార్యనగుదునని కాదుకదా?

కాళిదా:-- దాసియయిన వనిత, శయ్యలో భార్యయయి వర్తింపనగును.

విద్యాస:-- దాసీసంగమ మతిదూష్యమని శాస్త్రములు పలుకవా?

కాళిదా:--మారునిశాస్త్రమునందా విధిలేదు. ఏల కాలంబుగడిపెదవు? శయ్యకురమ్ము.

విద్యాస:-- మహాకవీ! మూఁడుఁగడియలలో విద్యారహస్యమెల్ల నాకుఁగఱపి నాకు విద్యాగురుఁడవైతివి. నన్నోడించిన కారణంబున నీవు నా స్వామివైతివి. పై రెండుకారణంబులచే నీవు నా తండ్రికుమారుఁడ వైతివి. కావున మీ రట్టిపనికి నన్నాశించుట ధర్మముగాదు. నీతికోవిదులిట్టి సంగమంబునకు సమ్మతింపరు.

కాళిదా:--వనితా! వావివరుసలు లేని వారవధూటీకులమునఁ దండ్రియననేమి తాతయనేమి సుతుఁడననేమి?

విదాస:--మహాకవీ! వావివరుసలు చూడనివారు మీరు. అవ్వను, బిడ్డను, మనుమరాలును, గలయఁగోరెదరఁట. నేను సామాన్యవేశ్యనుగాను. నీతిశాస్త్ర కోవిదను. నేను మీకు మర్యాదగల దాసినగుదునుగాని భార్యకాఁజాలను. శయ్యాసుఖంబిడఁజాలను. మీకు నా దాసీత్వము వలదేని సెలవిడిన నే నెందైనను బోయెదను.

కాళిదా:--వనితా! నిన్ను వదలను. మరుతాపం బోర్వఁజాలను రమ్ము.

చం. మదనుని మంత్ర ధర్మములు మానినినీవు నెఱుంగవైతివో
మదికిని జ్ఞప్తిరాదో, మటుమాయలు సల్పుచు మోసగించెదో,
మదవతి యౌవనాంగుఁడిటు మన్మథభూతము తన్ను నేపఁగా
నొదవిన సుందరీమణిని నోపిక, నోపికవాణి పాయునే.

ఓ సారసాక్షీ! నీతో శయ్యాసుఖం బనుభవింపక నే మానను.

విద్యాస:--అట్టిపనికి నేను సమ్మతింపను.

కాళి:— అటులయిన నీశపథము నాశపథము గాంచెను.

విద్యాస:-- నా శపథమెన్నటికిని నాశపథము గాంచదు. నీ వీలి యవినీత విధియాయెను.

కాళిదా:--ఈ వాగ్వాదమునుండి ప్రయోజనంబులేదు. రాజుగారి యాస్థానమును జేరుదము. అచట రాజుగారెటు నిర్ధరింతురో యటు నల్పుదము.

విద్యాస:-- మహాకవీ! నీ వుండినస్థానమే నాకు నాస్థానము. నీ యానలి ననుసరించెద మీ వెంట నేవచ్చెద.

( కాళిదాసు నిష్క్రమించును. )

విద్యా:— " గీ. పెండ్లియాడి నన్నుఁబ్రీతినిఁ జూడక
కఠినుఁడగుచు నాఁడు కష్టపెట్టె
రాజసభను వీనిరాణిగ స్థాపించి
వెలఁదిసాహసంబు వెల్లడింతు.''

( నిష్క్రమము. )

తృతీయరంగము.

భోజునియాస్థానము

భోజరాజు-విక్రమరాజు-పండితులు- కాళిదాసు-మదనసేన.

భోజ:— బావా! బహుదినములకు నీదర్శనలాభంబు నాకులభించెను. ఇపుడు నీరాకకుఁగతంబేమి?

విక్రమ:—నాయనా! నేనతిపాతకిని. బిడ్డపాపలు లేక బహుదినంబులు వ్యసనాంబుధిలో మునిఁగి యుంటిని. అంబాభవానీ కృపచే నొకకన్యనులోకమాన్యనుగంటిని. ఆనాతనయ సర్వవిద్యా ప్రవీణయయి తనకంటెవిద్యలోనధికుఁడగువానినే, పెండ్లియాడెదననిపట్టుఁబట్టెను. అట్టిరాజ పుత్రులెవరును దొరకరైరి. తుదకు నామంత్రియును నాయాస్థానపండితుఁడును నొకస్ఫుర ద్రూపియగు, బ్రాహ్మణవరునిఁ దెచ్చిరి. ఆవేదవిదుని పాండిత్యమునకు వచ్చెరువంది నా బిడ్డవానినిఁబెండ్లియాడెను. అదిరయేమికారణమో వివాహదినంబుననే నాజామాతయుఁ దనయయు గృహమువదలి యెచటికో పోయినారు. ఎందువెదకినను గానరారు. నీయాస్థానము విద్యాస్థానము. పండితులను వారిచటఁజేరుదురని వచ్చితి.

భోజ.— ఆ పండితుఁడు మహాకవికాళిదాసుండునా?

[కాళిదాసుప్రవేశించి)

కాళి:— ఉ. ధారణిపాల, నీముదలఁదాల్చుచు, వారపథూటివాటికిన్

జేరుచు, మంత్రవిద్యల నజేయుఁడనై, వెలయాంద్రజాలముల్
జీరుచు, విద్యలన్ గెలిచి, చెల్వను దాసిగఁ గొన్చు, దానినీ
చేరువఁ బిల్చి తెచ్చితిని, చేరెను నీయశమెల్లదిక్కులన్.

భోజ:— (లేచి కాళిదాసునుఁ జేరినమస్కరించి] కాళిదాసా! కవియనిననీవేను. పండితుఁడవనిన నీవేను. మిత్రుఁడవనిననీవేను. నాకు నిత్యకీర్తి నార్జించి తెచ్చినవాఁడవునీవేను. మిత్రమా! నా బావయయిన యా విక్రమరాజుగారిని నీ వెంద్రైననుజూచి యుంటివియా?

కాళి:— (ఆలోచనసభినయించి) నాపూర్వజన్మమునసైచటనో వీరినిజూచి నట్లుగపడెదు.

భోజ:— మహాకవీ! నీకుఁబూర్వజన్మమననేమి? పూర్వజన్మవృత్తాంతములు నీకుఁదెలియునా?

కాళి:— భోజనృపాలా! నాకు నీజన్మముననే రెండుజన్మములయినవి. ఆజన్మము దేవరహాస్యము.
(వారవధూటి ప్రవేశించి కాళిదాసునకు నమస్కరించినిలుచును. భోజరాజుదానినిజూచి)

భోజ:— వారవధూటీ? నీవు జగతియందలిపండితులనెల్ల జయించితినని గర్వించితివి. తుదకు నాయాస్థానమహాకవిచే గెలువంబడితివి. ఆతనిదాసివైతివి. నీవేదేశపువేశ్యవు? నీవృత్తాంతమేమి? చూడఁగనీవు వేశ్యగనగపడవు. కులీనలలనగనగపడిరాదవు. సహజవేశ్యగనుండినరొడల నిచ్చటివారికెల్లరకు వందనంబిడు చుంటివి? ఆటునీకొనరింపకయీ మహాకవికిమాత్రమునమస్కరించితివి. నిజముగునీవార్త దెలుపుము.

విద్యాన:— భోజభూమిపాలా! నాచరిత్ర, చిత్రముగనున్నది.

ఉ. పాతకినైతి, భూపతి; నృపాలుని పుత్రికనైజనించితిన్,
ఆతతనీతశాస్త్రములనన్ని పఠించితి, నద్వితీయయున్
ఖ్యాతివహించితిన్, దుదకునైతిని డంబరివాని భార్యగా
నీతజివేశ్య కన్యనయి, యీ కవిదాసిగనోడితిన్ గటా.

భోజ.— మహాకవీ! రాజపుత్రియయి డంబరవానికి భార్యయగుటకును, బిదపవేశ్యయగుటకును గారణమేమియుండును?

కాళి:— భోజనృపాలా! నేనెట్టివిషమసమస్యనైనను పూర్ణముసేయఁజాలితినిగాని, యీసమస్యభావంబు మాత్రము నాకుఁ దోఁపదర్యైను.

విక్రమ:— [భోజునిచెవిలో నేమిరొయో పలుకును. భోజుఁడు తలయూచి వేశ్యనుఁజూచి]

భోజ:— వనితామణీ! నీవుపలికిన పద్యభావంబిచట నెవరికిని జక్కఁగ గోచరింపదు. దానినీవే విస్తరించిపలుకుము.

వేశ్య:— భోజభూపతీ! నేనీవిక్రమరాజుపుత్రిని [విక్రముఁడు మదనసేనను కౌఁగిలించుకొనును.]

[భోజరాజు సంతసించును.]

భోజ:— ముందువార్తనెల్లనమ్మ తెలుపుము.

మదన:— తండ్రీ! నాజనకుఁడు చిన్నతనమునసే గురువులవద్దవిడిచి సర్వశాస్త్రంబులఁ బఠింపఁ జేసెను. ఆయుపాధ్యాయుండు నన్ను గామించి పరిభవింపఁ జూచెను. దైవవశమున నాముప్పు తప్పెను. నాతండ్రి మంత్రికి నైతము తనసుతుని, నేవరింపనైతినని నాపై ద్వేషము కలిగెను. వారిరువురు, గాడిదలు కాచునొక దంబరినిఁ దెచ్చి పండితోత్తముఁడని మోసగించి వానికి నన్నిచ్చి వివాహ మొనర్చిరి. శయ్యాగృహంబున నేను వాని వేషభాషలనుండియు నడవడికలనుండియు, వాఁడు గాడిదలు గాచు దంబరియని తెలిసి దుఃఖించితిని. ఎట్టకేలకు ధైర్యమవలంబించి, నామగఁడగు దంబరవానినిఁ బిలిచికొని, కాళికాలయముఁ జేరి, కాళీస్తవ మొనర్చి నాశిరము బలియియ్య సమకట్టితిని. దేవిప్రత్యక్షయై నామగని జిహ్వపై బీజాక్షరంబులు వ్రాసెను. వెంటనె నాభర్త యమృతము వర్షించులాగున శ్యామలాదండక మొనరించి పఠించెను. అయుంబ, మది మెచ్చి నామగనికిఁ గాళిదాసుఁడను నామంబొసంగెను. నేహర్షించితి. వెంటనే నా భర్త నాకు వందనంబొనరించి, విద్యాదానమొసంగిన జననియని, నన్ను సంబోధించెను. నేను భార్యయని యెంతగ బతిమాలినను దంబరవానికి భార్యవుకాని, నాకుఁగాదని, నిరాకరించి వెడలిపోయెను. నాపతివియోగంబు సైఁపనోపక బలాత్కార మరణంబునకు నుద్యమించితి. ఎచటనుండియో యొక మహాయోగి ప్రత్యక్షుఁడై, నన్నా యుద్యమునుండి మరల్చి వేశ్యవై ధారానగరంబుఁ జేరుము నిన్ను జయించువాఁడే నీపతియని తెలిపి వెళ్లిపోయెను. తత్కారణంబుననే వేశ్యనైతిని. ఇదియె నా దుఃఖచరిత్రము [అనుచు దుఃఖించును].

భోజ:— అమ్మా! నీవు దుఃఖింపకు. నీ తండ్రి నా బావ. (కాళిదాసునిఁ జూచి) మహాకవీ! ఈ వనిత తెలిపినవార్తలో నెద్దియైన నలీకమున్నదియా?

కాళిదా:— భోజనృపాలా! ఈ విషయ మెద్దియు నాకు స్మరణకురాదు.

[వీరయోగి పాటఁ బాడుచు ప్రవేశించును. అందఱు నమస్కరింతురు.]

భోజ:— స్వామీ! వందనంబులర్పించెద. తమయానతిరీతిగ మహిషపురి రాజ్యంబు స్థాపించి, మహిషాసుర మర్దనిని, నచ్చటి పర్వతంబుపైఁ బ్రతిష్ఠించి, యీ మైసూరురాజ్యమునందు నావంశమువారిని వదలి పిదప నా పినతండ్రి వేఁడికోలువిని ధారానగరంబుఁ జేరితిని.

మదన:— మహానుభావా! మీ యానతి ననుసరించి వారవనితనై యీ పురిఁ జేరి యిచట పండితులనెల్ల నోడించితి. తుదకీ మహాకవిచే నోటువడితిని.

వీరయో:—మదనసేనా! ఆ మహాకవియే నీపతి.

కాళిదా:--స్వామీ! నేను సద్బ్రాహ్మణుండను. వేశ్య నాకెటు పాణిగృహీతయగును?

వీరయో:—కాళిదాసా! తెలిపెదను వినుము. ఈ నృపాలుఁడు బ్రహ్మయొక్క యంశము ధరించినవాఁడు. దుర్వాస శాపోపహతుఁడై మానవజన్మమెత్తినవాఁడు. సరస్వతి శాపోపహతయై కశ్యపునకును మదాలసకును పురుషరూపంబున భువిఁబుట్టెను. మదాలస బాలుని కాననంబున విడిచిపోయిన కారణంబున ధర్మపరవాండ్రా బాలునిఁ బెంచిరి. ఆ పురుషుఁడు నీవేను. ఈ మదనసేన దుర్వాసాంశమును ధరించిన స్త్రీ. పతివియోగ దుఃఖం బెంతటి భేదిదంబగునది యనుభవమున దెలియుటకునై, శాపవశంబున భువినిఁ బుట్టినది. ఆ కష్టమిప్పుడు తెలిసినది. ఇచ్చట పండితులెల్లరు మహాపురుషులు. మీ రెల్లరిక భువిలో మనియుండి శీర్ణమగు దేవభాషను వృద్ధికిఁ దేవలెను. ఈ మదనసేనను బ్రాహ్మ్యవిధినిఁ బెండ్లియాడి సుఖమున నుండుము. నేఁ బోయివచ్చెద.

[ అందఱు నమస్కరింతురు. వీరయోగి నిష్క్రమించును. ]

భోజ:— ఇవి యన్నియును దైవవిచేష్టితంబులు. [ కాళిదాసునిఁ జూచి ] మహాకవీ! ఈ మదనసేన నాబిడ్డ. నీకునిచ్చి బ్రాహ్మ్యవిధిని వివాహంబొనర్చెద. ఇపటినుండియు నీవు నాకు జామాతవు.

కాళిదా:--భోజనృపాలా! నీ యానతి నావగింజంతైనను దాఁటను.

మంగళం.



